సారస్వత చంద్రికా గ్రంథమాల. కుసుమము ౨

సంపాదకుడు

శ్రీ ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దరు,

జమీందారు.

*

ప్రకాశకుడు

శ్రీ మామునూరు నాగభూషణరావు

# పాత్రలు.

---

శివాజి

రఘునాథ్ భల్లాణుడు

తానాజిమాలసురే

సూర్యాజి

గోపీనాథ్

కృష్ణాజి

నేతాజీఫాల్కర్

చందర్ రావు

అబ్దుల్ రజాక్

శివానందుడు

జనార్దనదేవ్

సరళ

కమల

# కృతజ్ఞత

నిజాంరాష్ట్రనివాసులు

శ్రీ శ్రీ కొండపల్లి లక్ష్మణరావు,

బసవరాజు సత్యనారాయణరావు,

దేశముఖ్ దేశపాండ్యాగార్లకు.

ఇది యొక వియోగశాలినీ హృదయపీఠి
కాప్రపూజిత మధుమల్లికా సుమమ్ము.
అలము కల్పాంతజలధరమ్ముల నిశీథ
గాఢతర తమస్సులు గ్రమ్మ కనులలోని
బాష్పములు మ్రింగి ఆచుకోబడక నాగ
ళమ్ము జీరలువోయి, భారమున వెలితి
వోయి పాడిన దానాటి పూర్వగాథ.
సాంద్ర తావక విక్షా ప్రసాదమసృణ
శిశిర సంపద నాపూవు చిదుమబడక,
ఆంధ్రరసిక ప్రపంచ శిరోవతంస
మహిత గౌరవ మొకనాడు మలచుకొనునా!
అటుల యగునేని యీకీర్తి కంతుగలదె!!

ఇట్లు విధేయుడు,

ఉటుకూరు సత్యనారాయణరావు.

# ర ఘు నా ధ్.

## ప్రథమాంకము.

### ప్రథమ రంగము.

( స్థానము—ప్రతాపదుర్గము - సభాభవనము
సమయము ఉదయకాలము - శివాజి ఏకాంతముగ నుండును. )

శివాజి

ఢిల్లీశ్వరుని యనుగ్రహమున మజ్జనకుడు విముక్తుడైనాడు. సుల్తానుని దౌష్ట్యమునకింకను మేరలేకున్నది. బీజాపురాధీశుడు ననోన్మూలించుటకై ఒక గొప్పసైన్యమును వెంటనిచ్చి అఫ్జల్‌ఖానను తురుష్కసర్దారుని బంపినాడు. వాడును తన ప్రబలసైన్యముతో పట్టణముల ధ్వంసముసేయుచు వచ్చుచున్నాడట. తుళజాపూరు, పండరుపూరు మొదలగు సుప్రసిద్ధ హిందూక్షేత్రముల కొల్లగొట్టి, హిందూ దేవాలయముల ధ్వంసముసేయుచున్నాడని తెలియుచున్నది. ఎంతకాల మీ భారతభూమి యిట్టి అస్వాతంత్ర్య జీవితమును గడుపవలయునోగదా! ప్రాణములకన్న మిన్నగాదలపోయు దేవాలయములే

నేలచదరము గావింపబడుచుండ నొకడును దేశాభ్యుద యమునెరుంగడే. భారతమాత యిట్టి పిరికి బానిసీడుల గన్నదేమి? వాడైదువేల గుఱ్ఱపురౌతులతోడను, ఏడు వేల కాల్బలముతోడను, మేలైన శతఘ్నులతోడను, సర్వసంగర సామాగ్రి సహితముగా దండయాత్ర వెడలి నాడు. రాజగడమునకన్న ప్రతాపగడము సురక్షితమై నది. ఈకోటచుట్టును భయంకరములై, ప్రభాకర కిరణ ములేని చొరశక్యముగానంత దట్టముగనున్న ఘోరా రణ్యములుగలవు.

జింజిరాపైకి దాడివెడలిన మహారాష్ట్రసైన్యములును రాబడినవి. మార్గమున కెదురగు పట్టణములనెల్ల కొల్ల గొట్టుచు మొన్న 'వాయి' క్షేత్రమునందలి దేవాలయ మును పడగొట్టి అచ్చటిజనులను క్రూరముగా హింసించి నాడట. పాపి! నేను ఇపుడున్నకోట తన కభేద్యమని తలంచి తనరాయబారి నొక్కరునిబంపి యుక్తిచే సాధిం పదలచినాడు లేకున్న ఆగర్భశత్రువగు సర్దారుడు—

గెలిచినకోటలిత్తుము సు ! ఖంపు నవాబునిశాసనంబులన్ దలపయి దాల్చికొల్చునెడ, త్వజ్జనకుండు శహాజిరాజుమా కెలమివిధేయు డెప్పుడు, న ! హీనపరాక్రములైనవారితో దలపడి పోరుసేయుటవ్య ! ధాశ్రిమసఖ్యముగోరుమింతటన్.

అని యీరీతిగా రాయబారమంపునా? ఇది మోస ముగానన్నుబట్టివధింపదలచెడియింద్రజాలము. కానిమ్ము చూచెదగాక! నేను రాజశాసనమునకు విధేయుడనై వర్తిం

చినచో నేగెలిచిన దుర్గముల నాకు బహూకరించుటా?ఇం దర్ధమేమున్నది? నేగెల్చినవి తామిచ్చుటయేమి? ఓహో! యుద్ధముచేసి వాటిని వశీకరణము గావించుకొనక విడచు చుండుటచేతవారిచ్చినట్లె యర్ధముగావించిరికాబోలు. ఈ తెలివితేటలురణతలమున గాన్పింపవలయునుగా. ఈకృత్రి మోద్దేశము నూహించి, వచ్చిన రాయబారిని లోగొని, ఆతనిచే నిజమెరింగి, "శూరులగు తమబోటిసేనానులతో పోరుటకు మేమంత సమర్థులముకాము. నేను దుర్మార్గముగ సుల్తానువారి దుర్గముల నన్నిం టిని స్వాధీనపరచుకొంటినని వారి కనంతమగు నాగ్ర హము కలదు. నెమ్మదిగ శ్రీనవాబువారికోపము నుపశ మింపజేసిన నాజయించిన రాజ్యమంతయు దేవరవారి కి స్వాధీనముజేయ సంసిద్ధుడనైయున్నాను. తండ్రిగారి వలె నేనును విధేయుడను" అని కబురంపితిని. తన పరా క్రమమునుగూర్చియు, యుక్తిమార్గమునుగూర్చియు గర్వి తుడగు నఫ్జల్ఖానుడు నేను తన దర్పమునకు జంకితిన ని నమ్మగలడు.

(తానాజిమాల సురే, రఘునాధ భల్లాణుడు, నేతాజీ ఫాల్కర్ మొదలగు సర్దారులు ప్రవేశము.)

(అందరు) ప్రభువువారిక తమ సేనానులు ప్రణమిల్లు చున్నారు. దేవరయాజ్ఞయేమి ?

శివాజి

మనము రాయబారమంపిన కృష్ణాజీభాస్కరుడింక

ను రాలేదు. ఖానుని సైన్యసమూహములు జావళీ పర్వ త ప్రాంతములయందు విడిసియున్నవి. ఆతడు నన్ను స గౌరవముగ దగ్గరకుచేర్చి పొడువదలంచుచున్నాడని మీ కు తెలిసియేయున్నదికదా. ఈమోసము సహింప రానిది.

రఘునాధ్

మోసము చేపట్టుకొనదలంచి తన యందున్న క్రోధమునంతయు వెలికిరానీయక రాయబారమంపినా డప్జల్ఖానుడు మోసగాండ్రను మోసముచేగాక వేరు మార్గమున సాధింపబనికిరాదు.

నేతాజీ

ఎంతక్రూరముదలంచినాడు. వానికి కాలముసమీ పించినది.

శివాజి

సరిగాని, మీరు ముందుగా జాగ్రత్తపడవలసిన వి షయము లనేకములు గలవు. రఘునాధా ! నీవు మన ప్రతాపదుర్గమునకు తూర్పుదిక్కున ప్రచండమగు నీసై న్యముతోడ కాచియుండుము.

ఖానుని రాయబారియగు పంతాజీ గోపీనాథుడును మన కృష్ణాజీభాస్కరుడును నేటిసాయంసమయమునకే రాగలరు. ఖానుని దర్శన మపేక్షించితిననియు దయ యుంచి వారిచటికి వచ్చినచో నేజయించిన దుర్గములన్ని యు వారికొసగి, సుల్తానువారి శరణార్థిని కాగలననియు

వర్తమానమంపితిని. రేపుదయకాలమున ఖానుడు కోటక్రింది సభాభవనమునకు రాగలడు. తానాజీ! నీవునాకు బాసటగనుండుము. ఆమోసగానిని అంతకన్న మోసముచే నెదుర్కొని హతమొనర్చెదను. తిరిగి దుర్గప్రవేశము సేయుటతోడనే అయిదు ఫిరంగుల ధ్వనియగును. రఘునాధా ! వెంటనే అరణ్యమధ్య ప్రదేశముననున్న యవనసైన్యము పైబడి సర్వనాశనముగావింపవలయును నీ వీ కార్యమునం దప్రమత్తుడవై ప్రవర్తింపుము.

రఘునాధ్

చిత్తము.

శివాజి

నేతాజీఫాల్కర్! నీవు నీసైన్యముతో నరణ్యమధ్యప్రదేశమున దాగియుండుము. కోటపై ఫిరంగులధ్వనియగుటతోడనే జావళీపర్వతప్రాంతములనున్న యవనసైన్యము పైబడి చెండాడుము. ఓసర్దారులారా ! ఈ మీ మాతృదేశ సందేశమును కృతజ్ఞతతో పరిపాలింపజనును. క్షాత్రవంతమగు మహారాష్ట్రకుల గౌరవమును గాపాడు భారమంతయు మీపై మోపినాడను.

నేతాజీ

మహాప్రభూ! ప్రాణములున్నంతవరకును మహారాష్ట్ర రాజ్యగౌరవస్థాపనార్థమె పోరాడగలము.

రఘునాధ్

ఆ విషయమై తాము చెప్పవలసిన దేమున్నది.

మానవమాత్రుడై పరమేశ్వరునివలన నించుక విజ్ఞాన ము ప్రసాదింపబడి, తాను, తనమతము, తన దేశము, అననే మోవాటి వర్తమాన పరిస్థితులెవ్వియో, తనకర్తవ్య మెద్దియో, గుర్తెరింగి స్వార్థపరుడై అన్నియు మఱచి, మత్తెక్కి తిరుగుచు, దేశద్రోహియై తానేకాక, తన భావిసంతతివారికిని పరాధీన కాలకూట విషమును ద్రావింపబూనువాని తుచ్ఛదేహమును చిత్రవధ గావించి నను నాదృష్టిలో పాప మాపాదింపబడదు. ప్రభూ! మిమ్ము వధింప వచ్చువానిని,......ద్రోహియగు వానిని......అభాగ్యము నాకు కలుగవలెగాని, మహారాష్ట్రము పేరెత్తువాడొకడుండునా?

శివాజి

ఇట్టి మిమ్ముల నందర నమ్ముకొనియే నేనీ మహారాజ్య నిర్మాణమునకు దొరకొంటిని. తానాజీ! నీవు నా వెంటనే యుండువాడ వేట సమయానుకూలముగ వర్తింపవలయును. ఖానుని యెదుర్కొనుట లాతివాని నెదుర్కొనుటవంటిదికాదు.

తానాజి

ఈ యగాధ పంకిలమునుండి లేవనెత్తబడుచున్న మాతృదేశమును చూచుచు శూరుడైనవాడు తన స్వధర్మమును మరచునా? చెప్పుకొనగూడదుకాని. తానాజీ యెదురై రణంబున భుజాదర్పంబుజూపించుచో నానానేక వరూధినీ విమత సం • తానంబులుగ్ పారవే

కానఁ సంశయమేల? దిగ్విజయసాక్షాత్కారమాలికు, ఆ పైనఁ స్థాపితమౌ స్వరాజ్యముమత ప్రాబల్యమ్మఁ గల్గెడుఁ॥

రఘునాథ్

తానాజీ. నీవు చెప్పినంత చేయగలవు. సందేహము లేదు.

శివాజి

సింహద్వారముముందు సూర్యాజి మొదలగు గొప్పగొప్ప సర్దారులనుంచి రెండువేల సిబ్బందిని వార లకు సహాయముగ నియోగించితిని. విశ్వసనీయులగు నో మహావీరులారా! రాజ నీతిశాలియు, పరాక్రమవంతు డును మాయకుడును నగువానిని సందర్శించు టెల్లెనను సిద్ధము. పన్నెండువేల సైన్య మాతనితోనున్నది. భ వానీ మహాదేవి కరుణాప్రసాదమున విజయమే కలుగు, కాక పరాజయమే కలుగు, వాని రక్తము కండ్లచూడ నిదే మరలిరావలెను. శంభాజీ సోదరుని మోసముచే మృత్యుగహ్వరమున కంపిన పాపి. అసంఖ్యాకములగు హిందూదేవాలయముల నేలచదరముగావించి స్వస్నైగ్ర హములమసీదులకు సోపానములుగ నొనర్పించిన హిం దూమత ధ్వంసకు డెన్నడును క్షమాపణార్హుడు కాడు.

నా యీతుచ్ఛప్రాణ సంరక్షణార్థమై మతధ్వంస కుల, భ్రాతృద్రోహుల మన్నించి యూరకుండగలనా? అన్నిటికి ప్రధానమగు నేటి నాయీ సందేశమును ని ద్రాసమయమునందును మరువవలదు.

ర ఘు నా ధ్

కౌనప్రాణమున నైన • గుటకాడుచున్నను
మన దేశమునకయి • పెనగువాడ
ఈ జీవములను హ • రీ! యని వదలు నం
దాక నే హిందూ మ • తమ్ముగాతు
భ్రాతృహంతకుని స • ర్వచమూ సమూహంబు
తో యుద్ధరంగాన • ద్రుంచువాడ
బ్రతికివచ్చితి నేని • పావన మహారాష్ట్ర
దేశభాగ్యమును నం • ధింపగలను
జయమే కలుగునో, విధి-పరా • జయమెయగునో
కనుము దేశము దేశమం • చనెదు తల్లి
గలదు, కొమరుడు శంభాజి • గలదుగాన
భారమంతయు మీయందె • వదలినాడ ॥

రఘునాధ్

ప్రభూ! మీ యమూల్యోపదేశములు మమ్ముల పరవశుల జేయుచున్నవి. మీ దేశాభిమానము మిమ్ము లనంతగ ప్రేరేపించినది గాని ఆజ్ఞయే యవశిష్టముగ సర్వకార్యముల తలయందుదాల్చి నిర్వహింపగలము. తానాజీ చాలశౌర్యవంతుడు, ఆతడు వెంటనున్నను చాల జాగరూకతతో మెలగవలయును. (పరికించి) ఆవచ్చునది గోపీనాధుడేయగునా? ఆ, అవును. మనకృష్ణాజీ భాస్కరుడును యిటెవచ్చుచున్నాడు.

నేతాజీ

మన సందేశమునకు ఖానుడేమనియెనో! గోపీనాధు

డగ్రహారాపేక్షచే మన కనుకూలముగనే ప్రవర్తించి యుండును. కృష్ణాజీ వెంటనే యున్నాడుగదా!

( పంతాజి, భాస్కరులు ప్రవేశము )

శివాజి

అయ్యా! మన సందేశమున కఫ్జల్‌ఖానుడేమనియె, కోటక్రిందికివచ్చి దర్శనమొసంగుట కంగీకరించినాడా?

పంతాజి

ఆతడు మేముచెప్పుటయే తడవుగ తమ సందేశముని కానందముచెంది తన సామర్థ్యమునుగూర్చి గర్విష్ఠుడై వెంటనేవచ్చుట కంగీకరించినాడు.

శివాజి

(ఆతురతతో) మీ కేలోపమును కలుగనీయను. వాగ్దానప్రకారము 'హీవరే' గ్రామమును వంశపారంపర్యముగ ననుభవింపవచ్చును. నిజవృత్తాంత మెరిగింపుడు. తాము గ్రకులజులు, మాకు దేవసన్నిభులు, రాజ్యధర్మానుసరణి గోబ్రాహ్మణ మతసంరక్షణార్థమెయే నేనిట్లు పాటుపడుచుంటినని కొంచెము సూక్ష్మదృష్టితో నవలోకించునెడల తప్పక మీసహాయము హృదయపూర్వకమైనదిగా నై యుండవలయును.

కృష్ణాజి

ప్రభువరా! వీరి సహాయమునుగూర్చి తామెట్టిసంశయమును వహింపకుడు. వీరు తమచాతుర్యమునుఖానుని

యెదుట చక్కగ ప్రదర్శించినారు. ఖానుడును వీరియం దత్యంతగౌరవ మర్యాదలతోనే వర్తించును.

శివాజి

పంతాజీగారూ! ఖానుడు తనసర్దారు లనేకమంది తో రాగలడేమో అట్లువచ్చుచో నేను భీతిజెందగలనని యు, ఏవోకొన్ని దుర్గములను జయించినంతమాత్రమున ఖానునివంటి ప్రసిద్ధసర్దారు నెదుర్కొనుట కీకొండగుహ లలో నుండువానికి భయావహమనియు చెప్పలేదు?

పంతాజి

మీ రావిషయమును నాకువచింప నవసరములేదు. చెప్పుకొనుట యెందులకు నాసామర్థ్యాతిశయముల సావ ధానముగకృష్ణాజి నివేదింపగలడు.జీవనములేక యవనుల సేవింపనయ్యెగాక, నీచమ్లేచ్ఛాధముల కొలువుసేతుమే? పవిత్రమగు హిందూమతేమునననుసరించి ధర్మమార్గమున చరింపక తమబోటి మేటిదేశీయవీరులను చంపదలచియె వచ్చితిమిగదా. ఇదియంతయు దరిద్రదోషము. ఆహా! ఈ దరిద్రమెంతపాపిష్ఠిది! దీనివలన పాపకార్యాచరణ ము, తన్మూలమున నరకప్రాప్తి, నరక బాధానంతరము దరిద్రము, పాపము, తిరిగి నరకము. దరిద్రునకెప్పుడును మోక్షములేదు. మీవంటి ధర్మస్థాపకుడైన ప్రభువుగలు గనేమికొదువ. మీరనుగ్రహించిన యగ్రహారముననుభ వించుచు తురుష్కసేవను బరిత్యజించి సుఖించెద.

శివాజి

(తనలో) ఈరాయబారి పూర్తిగ వశుడయ్యెను. ఖాను దొంటరిగవచ్చు నట్లేర్పాటగును. నిరాయుధు డట్లుగాన్పించుచు, రహస్యముగ నాయుధముల నుంచు కొని మోసగాడగు వానినవశ్యమైన మోసముచేతనే బరిమార్పవలయును. ఈరాయబారిని బంపివైచెదను. (ప్రకా) ఓయ్యా! తామేగి ఖాను దొంటరిగవచ్చు నట్లేర్పాటుచేయుడు. కృష్ణాజీ! నీవును వీరితో మరలవెళ్లి నా వచించినట్లు తెల్లవారు నప్పటికి వచ్చునట్లాతని నొడబరుపవలెను.

పంతాజి, కృష్ణాజి.

దేవా! అట్లె యొనర్తుము. శలవొసంగుడు.

శివాజి

నేతాజీ! రఘునాధ్! మీరలిరువురును పూర్వోక్త ప్రకారమున మీకార్యముల యందప్రమత్తులై మెలంగ వలయును. ఫిరంగులధ్వని యగుటతోడనే ఎక్కడవాని నక్కడ హతమార్పవలయును.

(రఘునాధుడు, నేతాజి పాల్కర్, తానాజి మాలసురేలు నిష్క్రమింతురు.)

మహావీరుల చరిత్రముల ప్రబోధించి నన్నింతవానిగ జేసిన పరమదేశభక్తురాలు నాతల్లి పవిత్రచరణార వింవముల కెరగి సన్నద్ధుడనయ్యెదను. ఇట్టి తల్లులెందరో వెలసినగదా మాతృదేశ దాస్యముతొలగిపోవుట.

 (నిష్క్రమించును.)

## ప్రథమాంకము—ద్వితీయరంగము.

(ఉదయము రెండుగడియల పొద్దెక్కినది. ప్రతాప దుర్గంమీదికి పోయ్యే రహస్యమైన మార్గముప్రక్క లోయలోనుంచి కొండ మీదికిపోయె చెట్లసందుగా కనబడుతున్నది. సూర్యకిరణములు దట్టమై పెరిగిన అరణ్యములోని అంధకారమును అపుడప్పుడే భేదిస్తున్నవి. ఖానుని వధించివచ్చే శివాజి, అభయంకరమూర్తి, ఆయన ముఖములో నేత్రములలో అపారమైన మాతృదేశానురాగము వెలుగుతున్నది. ఆయన అరహస్యమార్గముగుండా కొండయొక్క దుర్గము ప్రవేశింప బోతున్నాడు. తానాజీ మాలసురేయను ఒక మావళీ వీరుడు ఏనుగువలె వెంటబోతున్నాడు.

(తెరలో)

ఐదు ఫిరంగులు ఖానునివధించివచ్చిన సంజ్ఞగా యితరసర్దారులకు తెలియునట్లు పేల్చబడును.

———

## ( ప్రథమాంకము—తృతీయరంగము. )

జావళీపర్వత ప్రాంతారణ్యము—చెట్లసందులనుండి సంధ్యాయణ కాంతులు సైనికుల ముఖములపై ప్రసరించుచు రక్తాంతములగువారి నేత్రముల ప్రకాశింపజేయుచుండెను. అరణ్యమునందంతయు పెద్ద కల్లోలము-

తలపై దగిలిన గాయమునుండి కారుచున్నరక్తము నెడమ చేతితో నాపుకొనుచు, కుడిచేత కృపాణము, తూలుచు రఘునాథుడు వెన్నాడుచున్నాడు.

రఘునాథ్

ఆగుడు! ఆగుడు! పారిపోవలదు. ఇది క్షాత్రధర్మము కాదు. మేము మహారాష్ట్రులము. ఈమాత్రపు బింకమునకే యింత ఆడంబరమా? ఈ రఘునాథుడు గాయపడియు మాతృదేశముకొరకు పెనఁగులాడును. ప్రాణము లున్నంతవరకును పెనగులాడును. ఈ రక్తము మాతృభూమిలో ప్రవహింపవలెను. ఈ కంఠము మాతృదేశవిముక్తికై తెగిపోవలెను. ఇది మానాయకుని యాజ్ఞ—మాధర్మము.

(నడువజాలక తూలి క్రిందపడును.)

ఎక్కడివీ భూతములు......హిందూమత ద్రోహులగు తురుష్కులు, మహారాజును వధింపవచ్చిన తురుష్కులా? (ఎడమచే యూదుకొని లేవబోవును)

(తలదిరిగి క్రిందపడును) దాహము—

( తె ర లో )

ఎదురుగా పోరలేక దు • ర్మదుడెవండో
శాతభల్లాణమున్గొని • శౌర్యమూ ర్తి
యైన రఘునాథ మ స్తక • మందు బొడిచె
రండు రక్షింప నో మహారాష్ట్రులార !!

(పురుషరూపముతో సరళ ప్రవేశము)

ఏడీ, ఎక్కడ,......రఘునాథుడెక్కడ!

రఘునాథుడు

దాహాము—

పురుషవ్యక్తి

ఎవరు? దాహాము ? గాయపడియు తూలు చు వచ్చి యిచ్చట పడిపోయినావా ? వీరాగ్రేసరా ! దాహామగుచున్నదా ? ఏమిది, మాటాడలేకున్నాడు! కంఠమున తడి యూరుచున్నదికావలయును. నేవచ్చువర కేనియీాతడు సురక్షితముగనుండునా? (తడబడుచు నిష్క్రమించి దొన్నెలో నీరుతో ప్రవేశము కొలదిగా నీరుంచును. క్రమముగా రఘునాథుడు తేరుకొనును.)

రఘునాథ్

ఎవరునీవు? రఘునాథుని బాహువులలో నిం కను వీరరక్తము ప్రవహించుచునే యున్నది. (ఖడ్గముకై తడవుకొనును) అబ్బా! గాయము......బాధ.

పురుషవ్యక్తి

అయ్యా, గాయమునకు కట్టుగట్టించెదను. బాధ

క్షణములో తగ్గిపోవును. ఎదురుగా పోరలేక తురుష్కాధముడెవడో యీదురంతమును తెచ్చిపెట్టినాడు.

రఘునాథ్

మీరెవరు, మహారాష్ట్రులా?

పురుషవ్యక్తి

ఔను.

రఘునాథ్

నాదాహము తీర్చినదెవరు మీరేనా?

పురుషవ్యక్తి

ఔను.

రఘునాథ్

క్షమింపుడు. మీరే సైన్యమున నుందురు?

పురుషవ్యక్తి

నేతాజి ఫాల్కర్ మహావీరుని సైన్యమున.

రఘునాథ్

మొన్న క్రొత్తగాచేరిన మావళేవీరులామీరు?

పురుషవ్యక్తి

ఔను. గాయమునకు కట్టుగట్టించెదను కొంచెము నడువగలరా?

రఘునాథ్

మీపేరు వినవలయునని కుతూహలముగ నున్నది.

పురుషవ్యక్తి

దానికేమి? అందేమివిశేషమున్నది. నాధర్మము

నేను నిర్వహించితిని. నేను దూరమునుండి చూచి సైన్యము చీలి యిటురాకున్నచో చాలనపాయము తటస్థించెడిది. రఘునాథుడు గాయపడిన మహారాష్ట్రులగతియేమి?

రఘునాధ్

అది మీ కరుణాలేశము. నాకృతజ్ఞతకై ఈ యంగుళీయకమును గ్రహింపుడు.

పురుషవ్యక్తి

పెద్దలగుటచే గ్రహింపక తీరదు. (గ్రహించును) నేను సైన్యములో కలుసుకొనవలయును.

రఘునాధ్

మహారాజు క్షేమముగా దుర్గములోనిక చేరినాడా? ఖానుడు వధింపబడినట్లేకదా.

పురుషవ్యక్తి

(తనలో) ఈతనిమతి చెదరినది. ఖానుని వధించినవిధము ఫిరంగీల ధ్వనివలనవినియే సైన్యమును వెంబడించియు నిట్లడుగుచున్నాడు. (ప్రకా) చేరినారు. ఖానుడప్పుడే మరాఠసింహమువాత బడిపోయినాడు. నాభుజముల నూతగాగొని లేచిరండు. కట్టుగట్టించెదను.

రఘునాధ్

(తనలో) ఈవీరుని బాహువులెంత శౌర్యప్రధానములో అంత సుకుమారములుగనున్నవి! మాతృదేశాభిమానము చేతనేగదా ఈసుకుమారశరీరము మొరడువారనున్నది.

పురుషవ్యక్తి

(తనలో) ఈరఘునాధ బాహువల్లికా బంధమున జన్మము తరించినది. ఈవీరునిచే వరింపబడెడు కన్నియ యేగదా ధన్యురాలు. (నిష్క్రమింతురు.)

చందర్ రావు

(బొమ ముడిపాటుతో) విధి దుర్విపాకము రఘు నాధుడిట్లును చావలేదు. తురుష్క సైనికునిచే ఈకె పోటుతినియు బ్రతికినాడు. ఇది మొండిజీవము. నాపన్నుగడయంతయు వృధాయైనది. రాజున కీతని యెడల అత్యంతాభిమానము.

నాకురావలసిన సర్వసేనాపతీత్వ గౌరవము ఈరఘు నాధుని కాపట్యమున వ్యర్థ్యస్తమైనది.

ఈతడొక గొప్ప దేశభక్తుడని మహారాష్ట్రము గ్రుడ్డి విశ్వాసమునకు లోనైయున్నది. నిరంతర రాచకార్య పారంగతుడగు చంద్రరావాగారివమునకు పాత్రుడు కాడా? (యోచించి) వలసిన సాధనసామగ్రియంతయు సేకరించియేయుంటిని. అదిల్ శాహ నవాబుని సేనాని నాకు పరమమిత్రుడు. ఆతనిసహాయముతో నీకపటి రఘునాధుని వంచించెదను. దేశభక్తుడెవరో అప్పుడు గాని నిర్ణయింపబడదు. మహారాష్ట్రమంతయు నొక్క సారి చంద్రరాయ దివ్య వీక్షాప్రసాద లేశమునకై నిరీ క్షించునుగాక.

(నిష్క్రమించును.)

# రఘునాథ్.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

( ఆరామములో ప్రభాతమందవాయువులు సువాసనగా వీచుచున్నవి. ఆనందముతో పూలచెట్లు తలలూపుతున్నవి. పొన్నచెట్టుపైన ఆలపించే కోకిల సంగీతమునకు ప్రక్కసెలయేటి రొద శ్రుతి పోయుచున్నది. అది వసంతకాలము. సరళ మెల్లగా తీవల నొత్తిగించుకుంటూ చెట్ల సందులలోనుంచి కాలువ వద్దకు పోతున్నది. ఆమెవెంట ఒక స్నేహితురాలును కలదు. )

కమల

సరళా! నీ యౌవనశోభతోడ నారామశోభయు దినదిన ప్రవర్ధితమగుచున్నది. పోల్చిచూచినచో నీ యారామ రామణీయకతకన్న సహజవైదుషీ సమన్వితమగు నీవిలాసము త్రిలోక సమ్మోహనము.

సరళ

కమలా! నీఅతిశయోక్తుల కేమిగాని, ఇటురమ్ము. ఆపెంటిపక్షి ప్రణయకోపమును దాని ప్రియుఁడెట్లనునయించుచున్నాఁడో చూడుము.

వలగొను,పోవుచో కువకు • వధ్వనులక్ాజను వెంటితోడ, శా
ఖల నెటొ ప్రక్కనేయొదుగు, కంకుల చంచువులందనిచ్చునా
పులుగు ప్రసన్నమైన సగము • మూసిన కన్నుల తేలవైచె,ని
శ్చలత ప్రియుంను ముగ్ధుడయి • జార్చెకపోలములందు
[బాష్పముల్.

కమల

ఇట్టిచిత్రము లెక్కడనో జరుగుచున్నను నీకెట్లగు పడెనమ్మా! ఈ ప్రభాతవాయువులు ఆ మగపక్షి యుపలాలనమునకు చాల తోడైనవి.

ఈ ప్రభాతాంత్యసమయ మ • ల్లీప్రసూన
దళము లొరయుచు వలపుల • నొలకబోసి
పత్రముల సందుగా మంద • పవనమదియె
చల్లగావీచు ప్రియునచ • శ్రైలివోలె.

అనుభవింపగలవారికి ప్రకృతిలో నెంత ప్రశాంత మాధుర్యమున్నది! ఇట్టి సమయములు మముబోలు చెలిమి కత్తియలతో విని యోగించుటకన్న............ (ఊరకుండును)

సరళ

(ఆశ్చర్యముతో) కమలా ఏమియో చెప్పదలచి వెనుకాడుచున్నావు?

కమల

ఔను, నీవు గ్రహించితివని యూరకుంటిని చెప్పుదునా?

సరళ

అభ్యంతరమేమిః చెప్పుము.

కమల

ఆయానంద సమయములో ......సమయములో...

సరళ

చెప్పరాదు? ఆగ్రుక్కుళ్ళు మింగుట యెందుకు !

కమల

ప్రియుల.........నీకు తెలియనట్లు నరచేదవేమి-నేను చెప్పను.

సరళ

తెలిసినది. ఈమాటకేనా యింత ఆర్భాటము ఆ పొదలలోనుంచి అంత విస్పష్టముగా వినిపింపకున్నను మధురముగానున్నది.

మంద మందానిలతరంగ • మాలికలను
గలసి మచ్ఛ్రీవః వేయుమై • కమల ! వింటె
అదియె వినవచ్చు మోహన • మ్మైన గీతి
పశువులకు శిశువులకు గూడ • బ్రహ్మపథము.

కమల

ప్రియంవదా ! నీవెంత బేలవు ? ప్రతిదినమును వినుచునేయుంటివిగదా. అది ప్రసవర సామృతాస్వాదనోన్మాదినియగు భ్రమరాంగన. నిజముగా నున్మాదుల గీతము లోకొక్కకయెడ చాల ఆనందముగనుండు

ను. వారి కంఠస్వరమును గుర్తించుటయు కష్టము కాని నీమనస్సీ దిన మన్యాయత్తమైనట్లున్నది.

సరళ

కమలా! నీవాక్యములయందే నీకు ప్రత్యుత్తరము గలదు. ఉన్మాదుల కంఠస్వరమును గుర్తించుట కష్టమని ఇప్పుడేకదా చెప్పితివి. నాకుమాత్ర మెట్లు గుర్తింప సాధ్యమగును.

అట్టిచో నామనస్స న్యాయత్తమైనదని సకారణముగ నెట్లు నిరూపింప గలవు?

కమల

సరళా! నీపాండిత్య ప్రకర్షత నాకడలేదు. నవనవోన్మేషిత యౌవనప్రాదుర్భావవగు నీచిత్తము ఏమనోహర దృశ్యమున నేని లగ్నమౌనను సక్రమముకాదా?

సరళ

ఔగాక. ఇప్పుడేమనియెదవు?

కమల

మాబావగారెవరో తెలియగోరెదను.

సరళ

ఓహో! భ్రమరాంగన యున్మాదము వర్ణింపబోవ, నీకేయది ఆవేశమైనట్లున్నదేమే. ఈ మాటలకేమిగాని, అదిగో ప్రాగ్దిశాచల వీధులలోనికి లోకబాంధవుడేతెంచుచున్నాడు. ఇక తడయరాదు. పూజాకాల మతిక్రమించుచున్నది.

రఘునాథ్

లోకబంధుసమాగమా • లోకనమున
జలజములుపిచ్చి మొలక న • వ్వులు దొలంకె
ఆతఁడో పైన, నివినీటి • యందు నిచట
అరయగాలేము సృష్టిర • హస్యమేమొ.
ఈమాలతీ పుష్పములను కోయుదమురా.

కమల

(పూవులు గోయుచు)

ఒకటిచెప్ప మఱచితిని. బిజాపుర సంస్థానము క్రింద నున్న తోరణదుర్గము మొన్న యీనడుమ కడుచాతుర్యముగా శివాజీ మహారాజు వశపరచుకొనెను. వశీకరణకార్యము బహుభయంకరముగ నిర్వహింప బడెనట, ముఖ్య నాయకుడగు రఘునాథ భల్లాణుని శౌర్యమును జనులెల్ల పొగడుచున్నారు.

సరళ

అఫ్జల్‌ఖానుని వధించునాడు తన సైన్యముతో, జావళీపర్వత ప్రాంతారణ్యమున నున్న తురుష్కులతో బోరునప్పుడు ఒకతురుష్కుడు మోసముగా వెనుకనుండి భల్లాణముతో శిరముపై వేసెను. రక్తము ధారలై కారుచుండగా, ఎడమచేత నదిమికొనుచు తూలుచు యుద్ధము చేసినాడు.

కమల

ఆనాడునీతో రాలేక ఆమహాభాగ్యమును గోల్పోయితిని.

సరళ

క్షత్రియ పౌరుషము దేశారాధనకన్న, ధర్మసంస్థాపన కార్యమునకన్న యీతుచ్ఛ ప్రాణములపై తీపి వహించునా?

భండనభూమి నిల్చి పటు • పౌరుషలీల జయాభిలాషకో
దండవిముక్త శాతసము • దగ్రశిలీముఖ రాజిశత్రులన్
చెండినివాడె వీరుడగు • ఛీ! యని నవ్వరె దేశముక్తకె
వ్వండునిరోధియై బ్రతుకు•వాని,కులాపశదున్ దలంచినన్॥

కమల

సరళా! కోపించవేని చెప్పగలను. నీస్వరూపలావణ్య విలాసముల కాతడెంతయు తగియున్నాడు.

సరళ

(సిగ్గునటించుచు నిరుత్తర యగును)

కమల

నాయూహ సరియైనదే. సరళా నీయుక్తాయుక్త పరిజ్ఞానము మెచ్చదగియున్నది.

సరళ (వినిపించుకొనక)

ఆహా! హా!! ఈద్రాక్షాలత ఎంతకోమలముగ నెదుగుచు పున్నాగ వృక్షమును మెలివైచుకొని పోవుచున్నది. అటుచూడు. అచ్చట కోమలములగు మల్లికాప్రసూనములు సగము విచ్చి కమ్మనిసువాసనల గ్రుమ్మరించుచున్నవి.

ర ఘు నా ధ్

(ఇంతకు మున్ను గోసిన పుష్పముల పూజాద్రవ్యము లుంచు పాత్రలయం దిడుకొని పోవుచుందురు.)

కమల

సరళా! ఇటు. ఇటు. ఇచ్చట మంచి మంచి పుష్పము లింతకుముందే వికసించినవిగలవు. అబ్బా! ఏమి యీ భృంగాగనల రొదలు, చెవులు గింగురుమనుచున్నవి. (మల్లికాపుష్పముపై నున్న తేటి నుద్దేశించి)

సరసములాడెదో!మధుపుంజాల్గాన నీచెలులెంతోబిల్వ ఈ కరణిని మానతగనగ. కారణమేమి?భవన్మనోహరుం డరయగ వచ్చు తేటి! ఇటు.లారడిజెందకు,తోటివారు గు ట్టెరిగిన సిగ్గుగాదొకో ఇ. సీ! మకరందము లానబో మ్మికన్.

సరళ

కమలా! నీవెంత యుక్తిశాలినివే! ఉపమాలంకారమును వర్ణించుటలో కాళిదాసుని మరపించుచున్నావు- పుష్పాపచయ కార్యమున నేను వెనుకాడుచు పరధ్యానమున నుండుటచే "నీవుకోరి వరించియున్న ప్రియుడు తప్పక లభింపగలడు. ప్రాణసఖివైన నాతో యధాప్రకారము పూజాప్రసవముల గోయుము." అనునర్థముతో ఆడుతుమ్మెద నుద్బోధించు మిషమున నన్ను హెచ్చరించుచున్నదానవుగదా.

కమల (తనలో)

నెచ్చెలి నా యుపమానమును గ్రహించినది. ఎట్టి దుర్ఘట సమస్యలనైన సులభముగ గ్రహింపగల మేధా శాలిని. రఘునాధుడు మొన్న జూపిన విక్రమ విహార మునకు మోహితయైనట్లు తోచెడిని (ప్రకా) నేనా ఆడుతుమ్మెద నుద్దేశించి బలికితినిగాని నీకొరకై గాదు. దూదిదొంగ యనగ గడ్డము తడివి చూచుకొను నట్లు నీయులికి నీవే బైటవేసికొనుచున్నావు.

సరళ

అసత్యము ముందు తరువాత నీవు జనించినట్లు తో చుచున్నదేమే. ఎంత నవ్వకుండ బొంకెదవే. పూవులు గోయుము. (ఇరువురును పూవులు గోయుచుందురు రఘునాథుడు యుద్ధాశ్వము నొక చెట్టునకుగట్టి ఒక చో విశ్రమించును) విచిత్రము. ప్రకృతిలోనియందము గ్రహింపగలవారికి గోచరించును.

ఫలవినమ్రము సహకార • పాదపమ్ము
మల్లికలు ముద్దులిచ్చెడి • మధుపములకు!
గాలి మధువంత యొలికించి • కదలెనెటకొ,
నిద్రమైకమ్ముపో పద్మ • నీ కుమారి
నవ్వుచున్నది ఈ కథాం • తరముచూచి.

(పరికించి) ఎవ్వరో పుష్పములచ్చట కోయుచున్న ట్లున్నది.

రఘునాథ్

జలము చెట్లకుబోయు • శ్రమచేత మోమునం
దోచెడు స్వేద బిం • దువులతోడ
తడియారు నెడప్రభా • తపు వాయువులు వీచి
కదలు కాడెడు నల • కములతోడ
పూవులన్గోయగా • బూనుట కసుగందు
తరుణారుణంపు హ • స్తములతోడ
గురుపయోధరయుగ • భరముచే నడచుచో
వడకెడు బడుగు నె • న్నడుముతోడ
ఆప్రణయముగ్ధమైన నే • త్రాంతికముల
జాలుగొను నవ్వుడాలు; అ • ప్సరసయేమొ!
గాలివాలున నీటిపై • తేలిపోవు
నావనైతిని వాల్గంటి • నవకమునకు॥

ఆ రెండవ యామె ఆమె చెలికత్తియ గాబోలు. ఎడనెడ కైదండ యొసగుచు శ్రమాపహార మొనర్చుచున్నది. (ఆలోచించి) జనార్దన దేవునకు సౌందర్య రాశియగు కన్యారత్నముండెననియు, ఆమె కేవల శరీర సౌందర్యముననే గాక, విద్యా వ్యాసంగముగూడ చేసినదని విన్నాను. ఆ యౌవనమూర్తి ... ... ఆ వెడద కన్నుల మందహాసరేఖలు, నిడుదలగు పెన్నెరులబంధమున మల్లికా గుఛ్చములు, ఆమె కాకున్న ఈ యంబికారామమున నెవ్వరు విహరింతురు? (ముందుచూచి) అది యేమి కారణమోగాని ఆవిలాసిని దివ్యమోహన సందర్శమైనదిమొదలుగ, అన్యవిషయముల మచ్చిత్తము

తగులొ్కనదు. మహారణ మొనర్ప బోవనున్న నాకీ వనితావలోకనము ప్రతిబంధకమే యైనది. అదిగో! వా రిటె వచ్చుచున్నారు.

పత్రముల మాటున గులాబి • పడుచువోలె
ఆవిలాసిని పొదరిండ్ల • నందగించు
చిదుమ కుండగ ముండ్లు ర • క్షించుకీతి
వచ్చుచున్నది వెంట నెవ్వతయొగాని!.

(సరళయుకమలయు,పువులుగోసికొనివచ్చుచు సమీపమునే యొక వీరుని ఆకస్మికముగజూతురు. సహజ లజ్జావతియగు సరళ కమల వెనుకనాగిపోవును)

రఘునాథ్ (శంకించి)

కన్యారత్నములారా! మీరలెవ్వరో మీపవిత్ర నామాక్షరములెవ్వియో నేనెఱుగవచ్చునా?

కమల

ఆర్యా! అభ్యంతరమేమి? మీరుచూడ సక్షత్రియశిఖామణులవలె దోచుచున్నారు. మీయమృత రసమొలుకు వాక్యములకు ముగ్ధలమైతిమి. ఇచట జనార్దన దేవను శివాజిసర్దారుకలడు. ఈమె యాతని పుత్రిసరళ. నేనాపె యనుగు నేస్తురాలను. నన్ను కమలయనిపిలతురు. మార్గాయాసభారమున జొక్కియున్న మీయుదంత మెఱుగ దలచుట సాహసముకాదేని దయయుంచి తెలియజేసెదరుగాక.

రఘునాథ్

నిజముగా మార్గాయాసముచేనున్నను, ఈ యారామ దివ్యసేవాతత్పరతచే బడలికయంతయు తీరిపోయినది. అపరిచితుడనగు నాకు మీయుదంతము తెలిపితిరి. మీ సరళస్వభావము మధురముగానున్నది. మీ రూహించి నట్లు నేను వీరుడను కాను.

సరళ (తనలో)

నాయదృష్టము చేరువకే వచ్చినది. ఈతడు రఘునాథు డని నాకు తెలియనట్లు కమలతో ప్రసంగింతును. (కమలతో మెల్లగా రఘునునాడు వినునట్లు) కమలా వారి నిగర్వము కడు ప్రశంసార్హము. వారు చెప్పినదానిలో నంతగా సత్యము లేదని నాహృదయము చెప్పుచున్నది. తమ నామధేయము మాత్రము తెల్పుట కేమి యభ్యంతరము కలదు?

రఘునాథ్

(స్వగ) నేను జావళీ ప్రాంతమున గాయపడినప్పు డిట్టి కంఠస్వరమే వినుపించినది. ఆయన పురుషుడు. సరె. (ప్రకా) అందు విశేషమేమున్నది. నన్ను "రఘునాథు" డందురు.

(సరళ చిరునగవుతో కమలవంక చూచును. కమల ఆశ్చర్యమును ప్రకటించును)

సరళ

నేను చెప్పినట్లే యైనదిగదా ?

కమల

ఔను, నీ వదృష్టవంతురాలవు. వెతుకబోయిన తీవ కాళ్ళకు చుట్టుకొనినట్లయినది.

సరళ (తీక్ష్ణదృష్టితో)

కమలా ! నీవు సాహసించుచున్నావు. నేనేమి వెతుక దలంచితిని ? ఏది సంభవించినది ??

రఘునాథ్ (యోచించి)

జనార్దన దేవు డింటేయున్నాడా?

కమల

ఔనిక్కడనేయున్నారు. మీకేమైన పనియున్నదా?

రఘునాథ్

బిజాపురాధీశునితో దలపడి పోరుటకు తీర్మానములు జరుగుచున్నవి. మహావీరులందరును యుద్ధసన్నద్ధులు కావలయునని మహారాజు హెచ్చరించినారు. జనార్దనునితో కొంత మాటాడవలసియున్నది. నేనును రణరంగమును చేరుకొనవలెను.

సరళ- (తనలో)

అయ్యో ! ఈతడు యుద్ధసన్నద్ధుడగుచున్నానని చెప్పుచున్నాడే. పర్యవసానమెట్లు పరిణమించునోగదా. జయాపజయములు దైవనిర్ణయములు. మత్పురాకృత పుణ్యఫలమెట్లు విజయోన్ముఖుడగునో, హృదయమా! తొందరింపకుము. ఆశూరశిఖామణిని జేపట్టిచరితార్థము కాగలమహాభాగ్యము నీకున్నదో లేదో.

ర ఘు నా థ్

క మ ల

ఆయనయింటి కడనేయున్నారు. నేడచ్చటనే మీరా తిథ్యము గ్రహింపవలయును.

ర ఘు నా థ్

సంతోషమే. ఐననేడెల్లనచ్చట నుంకుభాగ్యము నాకొనగూడదు.

సరళ (మెల్లగా)

ఇప్పుడేగదా వచ్చుట మార్గాయాసమైన దీరనిదే ఇంత వేగిరమెందులకు.

రఘునాథ్ (తనలో)

ఆహా! ఏమియీమాటల పొందిక! మధుర మోహనస్వరూపమునకు సొంపగు సంభాషణ నైపుణ్యమును తోడై నన్ను పరవశుని గావించు చున్నవి. ఈయమకేమని ప్రత్యుత్తర మీయగలను? నేడిచ్చట నుందునా? (ప్రకా) కన్యామణీ! నీసహృదయ భావము పొగడ దగియున్నది.

స ర ళ

వీరపుంగవా! తోరణదుర్గ విజయము మీయవక్రవిక్రమకళాప్రదర్శనము చేత నెజరిగిన దనివింటిమి. అప్జల్ ఖానుపన్నెండు వేలసైన్యమును చీకాకుపరచినారట. మీకీర్తి చంద్రిక మహారాష్ట్రప్రపంచమునదశదిశావ్యాప్తమై కళావంతము గావించినది. తత్కారణమున నూతనోత్సాహ మేర్పడినది. అట్టి పరాక్రమవంతులరగు మీసందర్శనమున ధన్యులమైతిమి. మాతృదేశ స్వా

తంత్ర్యమునకై ప్రాణములనేని ధారవోయదలంచు మీ దేశభక్తి ప్రశంసార్హము. నేడు మీరు మాయింట నతిధులగు భాగ్యముకలుగుగాక.

రఘునాధ్ (తనలో)

నా సంకల్ప మీడేరునా యేమి? ఏమైనను నాయుద్దేశము బయల్పరుప సాహసింపకూడదు. (ప్రకా) వేర భ్యంతరమేమున్నది. జనార్దన దేవునితో ప్రసంగించుటా లస్య మగు కేని తప్పక మీయనుగ్రహమునకు పాత్రుడను కాగలను. (అశ్వమును విప్పి ప్రయాణమున కుద్యమించుచుండును)

కమల (సరళవైపు తిరిగి)

సఖా! వింటివా? ఆతని యంత్యవాక్యము.

స ర ళ

ఏమి? జనార్దనునితో ప్రసంగించుటాలస్య మగుచో మీ యనుగ్రహమునకు పాత్రుడనుకాగలననియే కదా?

క మ ల

దాని యర్ధము గ్రహింపనేలేదా! "నేనిచ్చట నిలచెదను" అని యనవలయునుగాని, "మీ యనుగ్రహమునకు పాత్రుఁడను కాగలనే"మిటి? నేనింతకు పూర్వమే ఈ జోస్యమును వచించితినిగదా? నీయభీష్టమునకనుకూలమగు నర్ధమందు తప్పక నిమిడియున్నది.

స ర ళ (సిగ్గుతో)

అది వారి మాటల నైపుణ్యముగాని నీవూహించిన యర్ధమందు లేదు.

కమల

కాదు, కాదు. నీవు పొరపడుచుంటివో లేక నామూలమున నీయభీప్సి తాభిప్రాయము దృఢపరచు కొనుచున్నదానవో తెలియదు.

సరళ (కమలతో)

పదవే పోవుదము. పూజాకాల మతిక్రమించెడిని. వీరపుంగవా! శలవుగైకొందుము. మీకుయుద్ధమున జయమగుగాక.

కమల

ఆర్యా! శలవొసంగుడు.

రఘునాథ్

మంచిది. మీకు శుభంబగుత. (సరళ పోజాలకపోవును. వా రదృశ్యమగువరకును రఘునాథుడు చూచుచునే యుండును.)

రఘునాథ్

ఆవలుద నీలకైశిక • మందు జేరి
గాలిసోకినమాత్రన • కలగి యెగసి
పోయినవి మల్లికాసుమ • మ్ముల దళములు
హృదయమటుగాక దాన నే • యొదిగిపోయె.

హృదయమా! మహాహవ మొనర్ప బోవనున్న నీకీ వనితావలోకనము, తద్రూపవిలాసధ్యానము భంగకరము. ఆయమ ప్రణయాధిష్టాన దేవునిగా నిన్నను గ్రహింపగలదనియువ్విళ్లూరు చుంటివేగాని నీయదృష్టమెట్లు

పరిణమింపనున్నదో యెఱుగనేరవు. రాజ భక్తిపరాయణుడనై దేశసౌభాగ్య సంధానమునకై పోరుదలపెట్టిన నాకీయుదంతము మాటిమాటికిజ్ఞప్తియందు రానీయకుము. ఈయపూర్వ ప్రేమైక సమావేశమున తన్మయుడనై దేశమును మరచిపోదునేమొ. అల్లదేయా కానవచ్చునదే దుర్గాదేవ్యాలయమైయుండును. సత్వరమపోయి కార్యోన్ముఖుండనయ్యెదగాక.

(నిష్క్రమించును)

---

## ద్వితీయాంకము - ద్వితీయరంగము.

దుర్గాదేవ్యాలయము, ఉదయారుణకాంతులు ఆలయమును క్రమ్ముకొనుచున్నవి. అంతటను నిశ్శబ్దము, గాలిచప్పుడు క్రమముగా సూర్యప్రకాశములో కలిసిపోయినది. సామాన్య దుస్తులతో రఘునాధునిమూర్తి సగంభీర వినయముగా ఆలయముజేరి మోకరించి యుండును.

రఘునాథ్- (నిమీలితలోచనుడై)

తల్లీ! భవానీ! దీనుడగు నీభక్తునియెడ ప్రసన్నురాలవుగమ్ము. విజయసాధనములగు చరణ సరసీరుహములను చేతః పీఠినిల్పియుంటిని. నీకరుణాలేశము లేక నేకార్యమును సేయజాలము. రణతలమునజయమాపాదింపుము. స్వధర్మరక్షణార్థమై, భార్యాపుత్రాదుల, బంధుమిత్రుల, మడిమాన్యముల లెక్కింపక, తమక్షాత్రరక్తధారాప్రవాహముల నిజదేశీయ హృదయక్షేత్రముల స్వాతంత్ర్యబీజములు నాటదలచి సంగ్రామమాచరింపనున్న మహారాష్ట్రవీరవరేణ్యులత్యల్పసంఖ్యాకులు. వారిఆశయములు మహోన్నతములు. అనుగ్రహింపదగినవి.

ఆహవ దోహళుండయిన • యట్టిశివాజి మహారణంబు ను
త్సాహ మెలర్పలోకవి దితంబుగ దేశవిముక్తిగోరి తా
సాహసవృత్తి సేయుపటు • శౌర్యముతోడ భవాని! నీవు వి
ద్రోహము సేయనెంచవుసు • తుల్ బొనరించెడి కార్యమెప్పుడున్

రఘునాథ్

మాదగు రాజ్యమున్మతము • మంటను గల్పి తురుష్కము
ష్కరుల్
సాదరవృత్తిమాని మము • జంపదలంచిరి; తల్లి! భావి భా
గ్యోదయసూచకంబుగను • నొప్పెడుశ్రీమహారాష్ట్రరాజ్య సం
పాదన సేయనెట్టులను • పాయముసూపి తరింపజేసెదో.

మహారాష్ట్రకుల సమారాధిత ప్రధాన దేవతా!

నీయవ్యాజ కరుణారసప్రసాదమే, మావిజయసంధాన కారణము. ప్రభుభక్తియుతుడనై, దేశారాధకపవిత్రోద్దేశముతో బాహాటోపమేపార రణంబాచరింప నాకుధైర్యము ప్రసాదింపుము. ఇకతడయరాదు. జనార్దన దేవునితో మాటలాడవలయును.

(ప్రస్థానము.)

# ర ఘు నా ధ్

---

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

(బీజాపుర బహిర్భాగమున క్రొత్తగా వేసిన గుడారము ముందు అంధకారబంధురమగు నమారాత్రి. యుద్ధోచితమైనదుస్తులతో రఘునాథుడు శివాజి మహారాజుముందు నిలచియుండును. కరదీపిక కొలదిగా వెలుగుచున్నది.)

శివాజి

రఘునాథా! బీజాపురదుర్గ వశీకరణార్థమై సర్వసన్నాహముతోడ మన సేనావాహినులువచ్చినవిగదా. నీవును, తానాజీయును ఈ రాత్రి కడుజాకరూకతతో మెలగి మీమీ శౌర్యముల జూపవలయును. మహమ్మదీయసైనికులిప్పుడు నిర్భయముగా నిదురించుచుందురు. కోటచుట్టువేసి మన మత్త మాతంగయూథముల సింహద్వారము గదియనడిపి ప్రబల కుంభస్థలా ఘాతములచే కవాటభేద్యముగావించి కోటప్రవేశించి యవనసైన్యమును హతమార్పవలయును. ఈలోన చాలమంది కోటగోడలప్రాకి లోనికి జేరవలెను.

రఘునాథ్

ప్రభూ! భవదాజ్ఞాబద్ధుడనై నడువగలను. రహస్యము గానిట్లు కోటముట్టడింపవచ్చినామని మహమ్మదీయ సేనానులకెవ్వరికిని తెలియదు. కోట ముట్టడింపగనే మహ్మదీయ సైనికుల నొకనొక్కనిగలేపి ద్వంద్వయుద్ధమునకు దలపడి చంపగలము.

శివాజి

నేనురాకున్నను నిర్భయమే. ఈకోట మనవశమైనచో చాలవఱకు బీజాపుర రాజ్యము నాక్రమించుకొనినట్లే.

రఘునాథ్

తామప్జల్‌ఖాను వధావిధానమునకొనర్చిన ప్రయత్నములతో చాల నలసియుంటిరి. మరల వెంటనే ఈదండయాత్ర ఆరంభమైనది.

శివాజి

మహా వీరా! ఖానుని వధ బహు కష్టముపై నిర్వర్తింపబడినది. తానాజిమాత్రము చాలా స్వామిభక్తి పరాయణుడు. నీవలె అతడునురభసోద్రేకముతోవిజృంభించి ఆవిజయమునకు కారకుడైనాడు.

రఘునాథ్

సుల్తానునకు ఖానుని మరణవార్త తెలిసినప్పటినుండియు అతని విచారమునకు మేరయేలేదట. తనరాజ్యము తన చేతులలోనుండి జారిపోయినదనియే తలచుచున్నాడట. నిజమంతియేగదా. ఒకవంక ఢిల్లీశ్వరుడును రెండవప్రక్క

రఘునాథ్

మహారాష్ట్రులు, సమయమునకై వేచియున్న గోలుకొండనవాబు, వారిలో నంతఃకలహములు. ఈకోట వశీకరణయత్నము ఖాను వధకుపూర్వమునుండియు చేయుచున్నాము. నిజ మాతృపరాధీన శృంఖల విభంజ నోత్సాహులగు మరాఠ వీరులముందు యవనులన నెంతవారు. అరిరాజన్య మదేభకుంభయుగళోద్యన్మాంసఖండంబుదుర్భరశౌర్యోగ్ర మరాఠవీర బలహర్యక్షంబుభక్షించుసంగర మధ్యమ్మున, మాతృదేశ పరిరక్షాదీక్షపోనాడుము ష్కరుదేహమ్ము స్పృశింపబోవు కడు నీచంబంచు గోమాయువుల్.

శివాజి

సెబాస్! రఘునాధా! నీయనల్పమగు మాతృదేశానురాగము కొనియాడదగినది. నీవంటి సేనాని లభించుట నాపూర్వపుణ్య ఫలము.

రఘునాధ్

దేవా విజయసింహుడునుసూర్యాజియును నారాకకై నిరీక్షించుచుండెదరు. మహారాజు నాజ్ఞతీసుకొని రమ్మని పంపినారు. శలవా?

శివాజి

నీకు నేజెప్పవలసిన దేమియు లేదు. సర్వజ్ఞుడవు. అవసరమగుచో నొకసేవకుని నాకడ కనుపుము. భవానీయారాధనకు వేళయైనది. భవానీదేవి నిన్ననుగ్రహించునుగాక.

ర ఘు నా థ్

విమతకాననదగ్ధ • విలయానలాభమహా
గాంగేయవిక్రమ • క్రమవిభూతి
శత్రుమేఘధ్వంస • చటులజంఝూనిల
సాకూప్య గాండీవి • శౌర్యపటిమ
అరిమహార్ణవజలా • హార చండగభస్తి
యైనద్రోణాచార్య • నలఘుశక్తి
ప్రతిపక్ష హృదయదు • ర్వార శల్యంబగు
భీమగదాకళా • విర్భవంబు
మరతువోయేమొ రఘునాధ! దురమునందు
దళితవైరి విదారణో • ద్యత్ప్రభావ
కలిత భీషణ ఘనపరా • క్రమము జూపి
మరలిరమ్ము జయారంభ • గరిమమెరయ.

మరియు శివధనుర్భంగ సమయసముత్సాహదీపితకళా విజృంభణాభిరాముండగు శ్రీరాముడాది గాగలవీర వరేణ్యుల చరిత్రము లెన్నియేని నీకవగతము లైనవియే గదా మనయౌన్నత్య మంతయు ఈకోటవశీకరణముపై నాధార పడియున్నది. జాగ్రత్తసుమా.

ర ఘు నా ధ్

మహాప్రసాదము. గగనకాంత నిశీధినీలాంబర ధారిణియై యవనహృదయ కుహరాంతరవ్యాపితమదాంధ ముబోలి యొప్పుచు సాంద్రీభూతమై యావురించుకొని భయానకముగ నున్నది. కరదీపికా సాహాయ్యమునగాక సైన్యములు కోటముట్టడింప వలనుపడదు. నేపోయెదను.

రఘునాథ్

శివాజి

మంచిదిరఘునాథా! మరలతానాజీ విజయసింహుల తో నాపూర్వకముగ తమదేశమును మరువవలదని హెచ్చరింపుము.

రఘునాథ్

చిత్తము. (నిష్క్రమించును)

(వెనుకబడిన తనసైన్యముతో తానాజీ మాలసూరెకోటముందరకు వచ్చుచుండును. అతడు వచ్చువరకే రఘునాథుని ఆధిపత్యమున కల్లోలింపబడుచున్న సైన్యము, విరిగిన కోటద్వారము కనుపించుచుండెను. కరదీపికలయొక్క కాంతి తానాజీ మాలసూరేమహావీరుని మహారాష్ట్ర తేజము బయలు పెట్టుచున్నది.)

తానాజి

ఓరోరి! తురుష్క సర్దారులారా!
ఔరా! ధర్మవిహీనులై యిటులసూర్యాజీపరిశ్రాంతదోస్సార ప్రాభవుడైననాతనినె రోషంబూనుచు తాకుచే
బీరంబా నిక కాచుకొండు, వితతావేశుండు తానాజి, దుర్వారోగ్రప్రతిభాయుతుండగుచు సంగ్రామంబుకే తెంచె
[డిన్.

(పరిక్రమించి) ఓహో, హా! ఏమి యన్యాయము మావకే సేనానియగు సూర్యాజి యించుక నలసియుండుటను బురస్కరించుకొని ఒక్కపెట్టున తురుష్కులెల్లరును గవిసికొనుచున్నారే. కాని తమ సేనానాయకుని

కీయపాయమును రానీయక మావళేవీరులు యవనసర్దా రులదాకి తమ నాయకునికై ఖడ్గప్రహారముల కేని తల లొగ్గుచున్నారు. అదిగో! విజయసింహుడు తన యాశ్వికదళముతో వారలపై బడి నుగ్గునూచమొనర్చుచున్నాడు. సైన్యములు కోట గోడల ప్రాకి పోవుచున్నవి. కొంతమంది గోడల పునాదులలో నగ్నిదగుల్చుచున్నారు. కోట వశమైనది. రఘునాథుని శౌర్యమెంత కొనియాడదగినది. అల్లదె! దీపావళీకాంతిమధ్యమునుండి సమరోత్సాహుడై తురుష్క దంతావళములపై లంఘించుచున్న రఘునాధకేసరికిశోరమును జూడ నాయెడ లుప్పొంగుచున్నది.

విజయసింహుడు మహా • శ్వికదళమ్ము తురుష్క
వీరుల గదియించి • పోరుచుండె
నిజఖడ్గధారావి • నిర్భిన్నమస్తకు
లై ధరఁబడ రఘు • నాదు డదియె!
యవనచమూసమూ • హమున మూర్తిభవిం
చిన శౌర్యరాశియో • యనగదోచె
కలత నిద్దురచేత • తెలియక యవనులు
ఒండొరుల్ చంపుకొ • నున్నవారు
బళిర! మహారాష్ట్రవిజయ సం•వత్సరిభాక
రోదయారుణ కిరణ వి•ద్యోతమాన
తరుణ యవనాంగగళిత ర • క్తప్రవాహ
వీచికలు కోట గోడ బిం • బించుచుండె.

నేనేగి మహారాష్ట్ర విజయ ప్రభాకరున కర్ఘ్యప్రదాన మొసగి కృతార్థుడ నయ్యెదను. ఇక తడయరాదు.

(ప్రస్థానము)

(రాజగడమున వీధి.చందర్ రావు, అబ్దుల్ రాజాక్ అను బిజాపుర సుల్తానుని సైన్యాధిపతి.)

చందర్ రావు

అబ్దుల్! మాలసూరె ఫాల్కరుల పైకన్న రఘునాధుడన్న రాజున కమితగౌరవము. నిరంతర మాతనిశౌర్యమునుగూర్చియే మెచ్చుకొనుచుండును. నేడాతనికొక గొప్ప బహుమానము నీయగలడని తోచుచున్నది. రఘునాధునితో నత్యంత మిత్రత్వము నెరపుచు అతని చేవ్రాలుతోనున్న కాగితమొక్కటి మొన్న సంగ్రహించితిని. గెలుపెట్లో కలిగినను, మహారాష్ట్రుల రహస్యములన్నియు రాజద్రోహముచే ధనాపేక్షవలన తురుష్కుల కెరుకపరచినట్లు వ్రాసితిని. గనుక నిద్రావస్థయందున్నప్పుడు సైతము వారలు జాగ్రత్తపడి చాలవరకు పోరుటకవకాశము గల్పించుకొనిరని రాజు విశ్వసించును. రఘునాధునిచేవ్రాలు స్పష్టముగ గన్పించుచుండగ అతడు వ్రాయలేదని యనిమాత్రము ప్రయోజనమేమి. నీవా యుత్తరము ప్రభువునకు చూపుము. నన్నెవరును అనుమానించరుగదా! నీచెప్పు విషయములకు నేనుగూడ తోడుగానుందును.

అబ్దుల్ రజాక్

రావుజీ! నీతంత్రము, చాతుర్యము, సుల్తానువారికి బాగుగ తెలిపియుంటిని. తురుష్క రాజ్య మస్తమించే రోజుల్లో నింత సహకారము చేసిన మీచరిత్ర ప్రతిము సల్మాను మతస్థుఁడను జపించుతూ వుంటాడు. రఘునాధ్ జీకాదు. ఇంకా దుర్గాలుకూడా వశం జేసుకొనవలసి యున్నది.

చందర్ రావు

మన మాలస్యము చేయగూడదు. ప్రభువు సభాస్థానమును చేరియుండును. ఈ ప్రయత్నము నెగ్గినా, తరువాత తక్కిన దుర్గములన్నియు సుల్తానువారికి చెందువిధ మాలోచించవచ్చును రమ్ము. (నిష్క్రమింతురు.)

---

## ద్వితీయాంకము—ద్వితీయరంగము

(రాజగడములో సభామందిరము. ఉదయ మెనిమిదిగంటలు. సర్దారులందరి పచితెరీతుల సోఫాలు, మహారాజా సింహాసనము. మహారాష్ట్రవీరుల వీరకృత్యములు, దుర్గముల ముట్టడలు చిత్రించిన పటములు సభామందిరమున వ్రేలాడగట్టియున్నవి. సూర్యాజి, తానాజి, జనార్దనదేవ్ వచ్చి ఆసీనులగుదురు. తరువాత చందర్ రావు అబ్దుల్ రజాక్ ప్రవేశింతురు. రఘునాథుడును శివాజి మహారాజును సభాస్థానముచేరినంతనే అందరును లేచినిలతురు.)

శివాజి

మహావీరులారా! బీజాపురాధీశునికోట మనస్వాధీనమైనది. మొన్నరాత్రి బంధించిన తురుష్కుల నందరను వదలివేయుడు. మీామీా ప్రతాపాతిశయములెల్లను యవనాధముల కెరుక పడినవి.

ర ఘు నా ధ్

ప్రభువరా! మాతృదేశవిముక్తికై పోరాటమాచరించిమేము ధన్యులమైతిమి. ఇదియంతయు దేవరప్రోత్సాహమువలననేగదా.

తా నా జి

దేవా! తురుష్కులెట్టి యన్యాయమునైన జేయవెనుదీయరు. పాపము సూర్యాజి యలసియుండుటజూచి ఒక్కపెట్టున అతనిపైబడి ప్రమందింపజూచిరి. అప్పుడు విజయసింహుడు తన ఆశ్విక యోధులతో వారలముటడించినాడు.

సూర్యాజి

కడచిన రేయి రణతలమున జీవముల బాయవలసియు న్నను దేశసేవగావించు నదృష్ట మింకను నాకున్నది.

శివాజి

తానాజీ! నీవఫ్జల్ ఖాను వధయందును పాల్గొని చాల శ్రమనందితివి. మీకు నేనేవిధమున కృతజ్ఞుడను కాగలనో తెలియదు.

జనార్దన దేవ్

రాత్రి రఘునాదుడు నాకు చాల సహాయమొనర్చినాడు. ఆతడు లేకున్న తురుష్కుల కరకు కరవాలములకు నాకంఠ మర్పింపవలసియుండెడిది.

శివాజి

ఈ మహావిజయమునకు ప్రమోదితుండనై మీమీ యర్హతలకు తగినట్లు బహూకరింప దలంచుచున్నాను. మొదటినుండియు నొక్క అపజయమేని లేని, మహారాష్ట్రశూరుల ప్రతాపాతిశయములు తురుష్కులు బాగుగా చవిచూచినారు. ముఖ్యముగా రఘునాదుడొనర్చిన నిరంతరకృషిచే ఈకార్యమున సఫలులమైతిమి. ఆనిబిడాంధకార సమయమ్మున సర్వచమూపతిత్వముఁ బూని విరోధిరాట్టళన భూరిపరాక్రముడై గజేంద్ర ఘంటానినదమ్ము మ్రోగ పయనమ్మయి తాకిజయించె,లోకస మ్మానితుడుఁ కృతార్థుడు సు మా! రఘునాధుడు దేశభక్తిలోఁ.

తానాజి

జనార్దన దేవునకడ్డుపడినప్పుడు రఘునాధునిస్థితిచాల అపాయకరముగనుండెను. ఆహా ఆతనిపరహితజీవనము.

రఘునాథ్

దేవరవారిపైనను మాతృదేశముపైనను గల యను రాగము నన్నట్లు ప్రేరేపించుచుండును. ప్రభూ! ఆ తురుష్క హంతకుల ప్రయత్నముతో నున్నను చాల శౌర్యముతో రణమొనర్చిరి. ఇదిగో ఇచ్చటికి తీసికొని రాబడిన అబ్దుల్ రజాక్ సర్దారు రణతలమునజూపిన ధైర్య పరాక్రమాదు లనుపమేయములు. అంత్యమున కోష్ఠి మనవశుడయ్యెనుగాని ఇతడు శత్రువీరదుర్నివారుడు.

శివాజి

వీరులారా! మీరు బంధించుకొని తెచ్చిన మహమ్మదీయుల నందరిని వదలివేయుడు. కోట మనవశమై పోయినది. కరవాలాది యుద్ధసామాగ్రులనొసగి శరణార్థులైరి గదా. రఘునాథా! నిఖిల సేనాధినాథా!!

మాతృదేశాను రాగ సం • భవముచేత
విపుల గంభీరదోస్సార • విక్రమమున
జయముగూర్చితి ఖడ్గ రా • జమ్ముగొనుము
ధీర! ఇదియె మదీయ స • త్కారమయ్యా.

నిజముగా కార్యదీక్షకు దగుఫలితమిది కాకున్నను పలువురు వీరాగ్రేసరులలో నిదియొక బిరుదుగా గ్రహింపుము. (ఖడ్గమందించును)

రఘునాథ్

(రఘునాథుడు లేచి సవినయానందములతో ఖడ్గ మందుకొనును)

దేవా! నేను ఫలమపేక్షించి యించుకంతయు య త్నింపలేదు. నా దేశ క్షేమము కొరకు నిశ్చల దీక్ష వహించుట, సర్వస్వము నర్పించుట, తుదకు ప్రాణము లేనియు గోలుపోవుట పరమధర్మము. అది యొకరిమెప్పు నకు, కీర్తికిని చేయలేదు.

సూర్యాజి

తానాజీ! వింటివా వాని గంభీర వాక్యములు, అవి ఎంత ఆనందవహములుగ నున్నవి.

(చందర్ రావు సౌంజ్ఞచేయును)

అబ్దుల్ రజాక్ (ముందునకువచ్చి)

మహారాజ్‌జీ! నాదొక మనవి. యీసైన్యములో నొక రాజద్రోహియున్నాడు. తాము విశాలదృష్టికల వారు. గమనించుటలేదు. ఈనాటికిది విజయముగా మా రినను ద్రోహమే దీనిరహస్యము.

శివాజి (ఆశ్చర్యముతో)

రాజద్రోహియా?

అబ్దుల్

ఔర్ హుష్యార్ భీ.

శివాజి

మహారాష్ట్రుడా?

రఘునాథ్

అబ్దుల్

జి. సర్కార్. ఆతడువ్రాసినయుత్తరము కావలెన న్నచి త్తగించవచ్చును.

శివాజి

ఎవ్వడా ద్రోహి! వాడిచ్చటనుండెనా?...మహారాష్ట్రుడేనా? ఎంతకార్యమునకు బాల్పడెను. మహారాష్ట్ర రాజ్యగౌరవము మంటిపాలుసేయదలంచెనా? చూపింపుము. ఏదీయుత్తరము. ఇంద్రజాలము కాదుగదా యది...? నిజముగామహారాష్ట్రులలో కుట్రలు శత్రులకు నివేదించు వాడొకడుండునా? వాడెవ్వడైననగుగాక, తురుష్కరుధిరార్ణోరాశి దేలిపోవుమహారాష్ట్ర నౌకలో రంధ్రమేర్పడినదా! ఏదియైనసహింతునుగాని ఈమహాఘోము...(ఉత్తరమందీయగా గ్రహించి చదివి దీర్ఘనిశ్వాసరమొకటి విడిచి నిశ్చేష్టితుడై) ఆ, ఎంతవిపరీతము జరిగినది. ఎంతటిదారుణమున కొడిగట్టినాడు. ఆరాజద్రోహిని ఏమిసేయవలయును. కఠినశిక్ష విధించెద. ద్వీపాంతరావాసము - పొరపడుచున్నాను. ఇకేటిదయ, ఇకేటి విశ్వాసము, సర్వమునుభగ్నమైనది. వానికిమరణదండనమేసరియగుశిక్ష. అట్లుగాకున్న నామహారాష్ట్రము శత్రువులచేతులలో బడిపోవును. నాహిందూమత మధోగతి పాలగును.

రఘునాథ్

దేవా! ఆయుత్తరమేమి? అందేమి లిఖింపబడి యు

న్నది. ఈమీసేవకుని శరీరమున మహారాష్ట్ర వీరరక్త
ముప్రవహించు చుండగనే! రఘునాథ భల్లాళుని మొల
లో బాకువ్రేలాడు చుండగనే - రాజద్రోహి! మీపాద
ములకడ రాజద్రోహి!

శి వా జి

ఛీ! నీవెవడవు? పొమ్ము రఘునాధుడవా! అటుల
యిన నీ మొగము చూడను.

జనార్దన దేవ్

ఏమి! మహారాజున కాగ్రహమును విచారమును కలి
గించు నీయుత్తరమేమి? ఇది శత్రుకల్పనమా? మహారా
జువిభ్రాంతియా! ప్రభునకంతటి విచక్షణ యుండదో.

శివాజి (తన్మయా వేశములో)

ఓహో! ఇంతమాత్రమునకు మరణ దండనమే! నేనం
తకృతఘ్నుడనా? కాను, కాను, వాడమితవిశ్వాసపాత్రు
డే. నాప్రాణముయందలిప్రాణమే. మద్భవిష్యద్విజయ
జ్యోతియే. కాదు(చేవ్రాలుచూచి) ఎప్పటికిని కాదు. నిపు
ణులకపటతాంత్రికము నెవ్వడెరుంగును!వాడట్లునటించెను.
నిజమగు చేవ్రాలు గనుపించుచుండ వేరువిచారమేల?
(సభవైపుతిరిగి) మహావీరులగుసభికులారా! గడచిన రేయి
యుద్ధము నందొక కుట్రబయలు దేరినది. ఇదిచాలకాల
లము నుండియె రగుల్కొను చున్నదట. తురుష్కులకు
విజయోన్ముఖమై మన మధఃపతనులము కాదగినది.
విధి వేరు తలంచినాడు. సూర్యాజీ! చదివి వినుపింపుము

న్యాయవిచారణనగుగాక. (సూర్యాజీ ఉత్తరమందుకొని యిట్లు చదువును) తురుష్కుల పావనులగు నబ్దుల్ రజాక్ సద్దారువారికి. రఘునాథ భల్లాణుడు వ్రాయు విజ్ఞాపనములు. మీతో నిదివరకు కొన్ని రహస్యములను ముచ్చటించియున్నాను. ఇదివరకు అనేక యుద్ధములలో ప్రకటించిన నాపరాక్రమము శివాజీరాజు క్షేమమునకై గాక నాకీర్తికై యుద్దేశింపబడినది. రాబోవు యుద్ధమున శివాజి జయించిన నిక మీరాతనికి దాస్యము గావింపవలసినదె. ఇరువదివేల రూప్యము లొసంగి సర్వసైన్యాధిపత్యము నిప్పించినచో వానికుట్రలు వచించెదను. పాపము మీరు గాఢనిద్రయందుండగా ఎప్పుడో వచ్చి శివాజి ముట్టడించును. మీరాయుపేక్ష యెందులకో తెలియదు. నాయందు శివాజీకి చాల విశ్వాసము. ఆరహస్యములన్నియు నాకు తెలియును. తాము చూచినతక్షణ మీయుత్తరమును చించివేయుడు

భవత్సేవకుడు, రఘునాథుడని యున్నది.

(అందరు నాశ్చర్యమును ప్రకటింతురు. రఘునాథుడు నిర్విణ్ణుడై చూచుచుండును)

సూర్యాజి

ఆహా! ఎంతకార్యము జరిగినది: ఎంతఘోరమునకు పాల్పడెను. ధనమపేక్షించెనేగాని రాజ్యమతధర్మముల పాటింపడయ్యెగా. రఘునాథు డిట్లురాయునా?

తానాజి

రఘునాథుడు దారుణకార్యాచరణ దయ్యేనన జగము మెచ్చునే, పాపము శమించుగాక.

(రఘునాథ్ (తనలో)

హా! దైవమా!! నీసంఘటనలతి విచిత్రములు. నాదు రవస్థనుగూర్చి విలపింతునా? నీసృష్టిచాతుర్యమును దలచి ఆశ్చర్యానందముల వహింతునా? ఉత్తరమేమి? చేవ్రాతేమి? ఎవరు వ్రాసిరి? ఇది స్వప్నమా! నిజముగ జరుగు చున్నదా. లేక నాకట్లు వినపడెనా? నావిభ్రాంతియా, హృదయమా! విచారింపకుము. ధైర్యము వహింపుము. సర్వజగ దధినాథుండగు దేవుడు గలడు. హృదయ సంతృప్తికరమగు నాసత్ప్రవర్తనము గలదు. నారాజభక్తి గలదు. నా దేశభక్తిగలదు.

ఒక్కమారుగ నీ సర్వధర్మములును గతుల దప్పునేని నాకాపద సంభవించుటయు సిద్ధము. వీటి కెంతకాలము సద్గతి కలదో అంతవరకు యేయపాయమును కలుగదు. ఒకవేళ సంభవించినను వాటిసత్యమును నిరూపించుటకు యత్నించు నాధైర్య కంచుక మాపచ్ఛరా హతమై విచ్ఛిన్నము గాకుండుగాక.

శివాజి

ఏమిరఘునాథా! నీవురాజ ......(శంకించి) ద్రోహివైతివా? ఈయుత్తరమునీవేవ్రాసితివా? ఆహా! ఎంతఘో

ర ఘు నా ధ్

రమునకు వొల్పడితివోయి! అయ్యది దేశమతధ్వంసకా రణమని యెరుంగవా. నన్ను మోసగించితివిసుమా.

రఘునాధ్ (స్వగతము)

నేనేమి ప్రతుత్యుత్తరమీయగలను. మహారాజునాపై గల గాఢ విశ్వాసాభిమానములచే ప్రబలమగు సాక్ష్యము నిరూపించు నా చేవ్రాలుతోనున్న యుత్తరము దిలకించియు అడుగలేక యున్నాడు. రాజధర్మము మీరరానిదొట వారిహృదయము మహాసంక్షోభావస్థయందు బడిపోయినది. ఏక్రూరుడీ చేవ్రాలు సృష్టించె. (ప్రకా) దేవా! ఈవృత్తాంతము మీకెంత నవీనమో నాకు నంతియ. చెప్పిన నమ్మకముకలుగదుగాని ఈపాతకమున నాకెంతమాత్రమును సంబంధములేదు. అదిగాక నేను మహారాష్ట్రిడనని చెప్పుకొనదగిన యీనా జీవితకాలమునందెప్పుడును నా దేశమునకు ద్రోహముగావింపనని నాతల్లి భవానీదేవి దివ్యచరణారవిందముల యానగా ప్రతిన గైకొంటిని. ప్రతినయేల? ఏమాత్రమించుక లోకజ్ఞానము గలవాడైనను ఇట్టి యకృత్యమునకును స్వామిద్రోహమునకును వొల్పడడు. న్యాయశీలురగు సోదర వీరులుగలరు. తాము సర్వజ్ఞులు. ఇంతకన్న నీ యపనిందారోపణమున చెప్పదగినదియు చేయదగినదియు లేదు.

సూర్యాజి

మన మేమి చేయగలము. రఘునాధుడు ద్రోహియా? నామనస్సాక్షి నన్ను ప్రతిఘటించుచున్నది. నేననజాలను.

శివాజి

రఘునాధా! నీవు మోసగాడవు. నీవర్తనమెల్ల దెలియవచ్చినది. నీక్రూరబుద్ధిని బహుచాతుర్యముతో గుప్తము చేసితివి

రఘునాథ్

స్వామీ! నాకేమియు తెలియదు. ఆ అబ్దుల్ రజాక్ సర్దారు మన ప్రతిపక్షిపక్షము వాడుగదా.

శివాజి

బహుభాషి వికాకుము. నీవు వ్రాసిన యుదంతమిది. నీచే వ్రాలిది. (ఉత్తరము చూపుచు) మత్కర వాలము గలదు. రాజ శాసనమునుమా. నిజమువచింపుము. అనవసరముగ మదుగ్ర కోపానలాంభీల జ్వాలల కేలశలభమవయ్యెదవు?

రఘునాథ్

ప్రభూ! నాకీప్రాణములంత తీపిగావు. నాయందుదోషమున్న ఆసర్వేశ్వరుడు సర్వధ్వంసము గావించును. నిజముగా నీయభియోగ ఫలితముగ ఏయపాయము రానున్నను సంతోష పూర్వకముగ భరింపగలను. ఎందుకన నేనొక ధర్మకార్యమునకై, సత్య వాక్యపాల నోద్యోగినై బలిగా పరిగ్రహింపబడెదను.

తానాజి

అమంగళము ప్రతిహత మగుగాక.

చందర్ రావు (తనలో)

ఇదియే తగుతరుణము. రాత్రియుద్ధమునకు కొంచె మాలసించెను. ఇదియు నొక కారణమై ఈయభియో గమున కెక్కువబలముగ నుండును. (ప్రకా) ప్రభూ! ఏమికారణమోగాని ఆరాత్రి యుద్ధమున కించుక నాల స్యముగవచ్చెను.

తానాజి (దృష్టినిగిడ్చి)

వదరకు,నోరుమూయుతులువా!పలుమాటలుమానిచూచితే కదనము సేయరాడు వెను కంబడెనంచు, మరొక్కసారి బ లెక్కడవొకో?నాదుఖడ్గమిది నొక్కమియింపదుదుర్జనాళి; తా నెదురయిపోరి దిగ్విజయ మేర్పడ సేయడె రేయిదుర్గతీ.

(ఖడ్గము తీయును)

రఘునాధ్ (అపవారించి)

తానాజీ! నీవు తొందరపడకుము. భగవానుడు సత్య మును మరుగు సేయడు.

తానాజి

సర్వసైన్యాభేద్యతురుష్క మాయావ్యూహ విభంజ నసఫల మనోరధుడై శత్రుపక్షవీరులు హాహాకారము లొనర్చి శిరఃకంపములుసేయ విజయలక్ష్మీకర గ్రహణ మొనర్చివచ్చిన రఘునాధ మహావీరునిగా అధిక్షేపించు చుంటివి?

మహారాజన కీ యిచ్చకములు నచ్చవు. సర్వమెఱుంగు దురు.

చందర్ రావు

నీకున్నంతటి యభిమాన గౌరవములునాకునురఘునాధునిపై గలవు. కానిన్యాయము వచించుట కేనువెనుదీయను. కూడగా మీయిరువురకును ఇందుసంబంధ ముండ వలయునని తోచుచున్నది.

శి వా జి

మీవాదములు కొంతసేపు విరమింపుడు. రఘునాధా! రాత్రినీవు సంగ్రామమునకు కొంచెమాలస్యముగ చేరుకొంటివా?

రఘునాధ్

దేవా! చందర్ రావు సత్యమునే వచించెను.

శివాజి (మౌనము)

అబ్దుల్ రజాక్

సుల్తానువారి ఉంగరము రాత్రియుద్ధమధ్యమున నాతనికి బంపబడినది. బహుశా ఆతని కవచములోనేఇప్పటికిని యుండవచ్చును.

శివాజి (ఆలోచన నటించి)

క్రూరా! ఇదినీకల్పనగా దోచుచున్నది. రఘునాధుడపరాధియా? శాత్రవునిమాటలు నమ్మజాలను పొమ్ము. చందర్ రావు! ఆతనికవచమునం దెక్కడనైన అంగుళీయకముండెనేమొ బరీక్షింపుము.

చందర్ రావు (వెదకి)

దేవా! ఉన్నది ముద్రగూడ తురుష్కులదివలెనే యున్నది. (మహారాజు చేతికిచ్చును.)

(శివాజి చూచి, నిశ్వాసమువిడచి ఉగ్రుడై)

దుర్మార్గా! మతద్రోహి! నీకిక శిక్షతప్పదు. నీకుట్ర బయల్పడినది. నీమోసము బహిరంగమునకు తేరని నీవు నిర్లక్ష్యముగా అంగుళీయకమును కవచమునందే యుంచుకుంటివి. ప్రబలమగు సాక్ష్యములు రెండును నీసమక్షముననె కాన్పించినవి. (సభికుల నుద్దేశించి) సభికులారా! ఇకనైన రఘునాధుడు శిక్షార్హుడేనా? వీనికే శిక్ష విధింపవలయును. రాజద్రోహి మొగముచూడను. వీనిని క్షమించినచో ఇంకను ద్రోహములు ప్రబలిపోవును. రఘునాధా! ఇందులకు కేమిచెప్పెదవు?

రఘునాధుడు

నేనేమియు చెప్పజాలను. సర్వమును విధివిధానము.

సూర్యాజి (లేచి)

. మహారాజా! సోదర వీరులారా!! నాదొక మనవి కలదు. నాకు న్యాయమని తోచినవిధము వచించెదను. రఘునాధుని పిన్ననాటినుండియు మన మెఱుగుదుము. అతని సత్ప్రవర్తనము, శౌర్యము, ధైర్యము అన్నియు నింతవరకు జరిగిన దుర్గవశీకరణములయందు ప్రభువులకు చక్కగ విశదమైనవి.

ఇక ధనాపేక్ష నాతడు వహించి ఇట్టికార్యము న కొడిగట్టెనని చెప్పవలసివచ్చినచో ఆతనిసామర్థ్యాతి శయమున కనువుగ తామున్వయముగసత్కరించుచున్నారు. అదిగాక నాయనుభవమువలన గ్రహించినంతవరకు ఆతడు ధనకాంక్షచే పోరినవాడుకాడు. అతనికి దేశభ క్తియు, రాజభక్తియు మెండు. ఇకచే(వాలునుగురించి, అది శత్రుకల్పితము. ఆవిషయమై చందర్ రావునకుగూడ తెలిసియున్నట్లు నామనస్సాక్షి యుద్బోధించుచున్నది. రఘునాథు డందరిని స్నేహపాత్రులట్లుతలచువాడగుటచేత ముఖ్యముగా నింతమూడినది. ఎవడో ఆతని మిత్రుడ నని చెప్పువాడే అంగుళీయకమును కవచమున జార్చియుండును. లేకున్న అపరాధి యుంగరము చెంతనుంచుకొనునా? తమ చిత్తముపై రఘునాథుని యదృష్టమాధారపడియున్నది.

(చందర్ రావు ఏదో చెప్పబోవ శివాజి వారించి)

శివాజి

నాచిత్తమేమి ? న్యాయముకావలయును. పాతాళములోపడిన మహారాష్ట్రమును జీవితాశలు వదలి పైకెత్తునప్పటి రాజద్రోహిని నేనెన్నడును క్షమించను. రఘునాథా ! సూర్యాజి చెప్పినటుల చందర్ రావు నీకు విరోధియా ? లేక విశ్వాసఘాతుకముగ ప్రవర్తించువాడనియైన ఎప్పుడేని నీబుద్ధికి యోచించుకొనగలిగితివా?

రఘునాథ్

లేదు.

శివాజి (మెల్లగా)

అట్లైనచో రఘునాథా ! వినుము. నీవు విశ్వాసపాతుృడవై బహుదుర్గనిర్మాణ వశీకరణములయందు సాయపడితివని యభిమానముచే న్యాయదూరుడనై ప్రవర్తింపలేను. ఎదియెట్లున్నను నీచేవ్రాలుగల యీ లేఖాంశములసత్యములని చెప్పజాలను

చంద్రరావికార్యమున తెలిసినవాడనియు, నీపై నిష్ఠారోపించెననియు, చెప్పుటకైన సూర్యాజీ హేతుబద్ధముగవచింపలేదు. నీకునుఆతనికిని ఎట్టివిరోధములేదని నీవుస్వయముగానొప్పుకొనుచున్నావు. కావునఅతడు నిర్దోషి. అదిగాక తురుష్క సర్దారుని అంగుళీయకమొకటినీవద్దనేదొరికినది. ఆత డీ రహస్యము వెలిబుచ్చుడుగదాయని నీవుధైర్యముతో చెంతనే యుంచుకొంటివని నేననుమానించుచున్నాను. అందులకు నీవువిధివిధానమని నిరుత్తరుడవైతివి.(తనలో)కావున ఇట్టిద్రోహిని మరణశిక్ష విధింతునా? (ప్రకా) నీవు నీఖడ్గకవచ శిరస్త్రాణములను వదలి దేశ...భ్రష్టు...డవగుట కనుజ్ఞ యిచ్చుచున్నాను. సేవకా! ఈతనినిమన రాజ్యపు పొలిమేరలు......దాటిం (అని సవిచారముగ సభా మందిరమునుండి కంపించుచు పోవును. దిశలంధీ భూతములగును. రఘునాథుడు నిశ్చేష్టితుడైయుండును.)

సూర్యాజి

హా! హతవిధీ! నీ వెంత కై నజాలుదువు. నీవిధానమును మరల్ప నెట్టిమహామహులకును దుస్సాధ్యము. నీసామర్థ్య మద్వితీయము. ధర్మ మార్గానువర్తులకే కష్టపరంపరల సంధింతువు.

రఘునాథా! రఘునాథా!! నీకెట్టిదుర్గతి సంప్రాప్తమైనది. నీ వీ దుస్సహావమానము నెట్లుభరింపగలవు? నీవంటిపగమ వీరశిఖామణి, నీవంటి యపార సుగుణసంపన్నుడు, నీవంటి సన్మిత్రరత్నమును వేయి జన్మలకేని చూడగలమా? లేము. లేము. అట్టి యదృష్టము మాకిక లేదు. మే మీా దుస్సహ వియోగమును భరింపలేము. నేను నీ వెనువెంట నే వచ్చెదను. నన్నను గ్రహింపుము. మహారణ్యసీమలకేని, పర్వత గుహాంతరములకేని ఎట్టిదుర్గమ ప్రదేశములకేని రాగలను. (రఘునాథుని డాయం బోవును)

రఘునాథుడు

మిత్రమా! ఇదేమి వెఱ్ఱి? ఇది ధీరలక్షణముకాదు. నీవంటి శూరశేఖరుడిట్టి వంతకు లోనుకాగూడదు. నాబోటివానికి ధైర్య ముద్బోధించు స్థానమందున్నావు. ఏమానవున కేకాలమున కెయ్యది సంప్రాప్తముకాగలదో అదియంతయు పూర్వకర్మ పరిపాకాను సరణమై యుండును. సుఖదుఃఖములను సమానములని తలచి ఎవ్వడు స్వధర్మ నిర్వహణార్థము పెనగులాడునో వాని

రఘునాథ్

కెన్నడును మృత్యు భయముండ జాలదు. మహారాజు దేశాంతరవాస శిక్ష విధించెనుగాని మరణశాసన మొనర్చినను సంతోషపూర్వకముగ భరించెడివాడను.

నాపూర్వ కర్మంబు • నట్ట జేసి ప్రభువు దే
శమ్మును విడువ శా • సనము జేసె
శిక్షింప రక్షింప • శ్రీశుండెగాని క
ర్తృత్వమ్ము స్వీకరింపై • యొసగునయ్య
స్నేహబంధముచేత • చింతింతురే కాని
విధివిధానమ్ము గత • ప్పింతురయ్య
దేశభాగ్యమునకై • దీక్షతో వరించి
తినిగాన వేరు చిం • తింపనయ్య
కానిమహారాష్ట్ర నాయకా • గ్రణియు ప్రభువు
శ్రీశివాజి దివ్యపదరా • జీవములకు
కడ నమస్కారమర్పించి • కదలిపోవు
భాగ్యమది లేమి దుఃఖించు • వాడనయ్య.

(గడ్డము పుచ్చుకొని) మిత్రమా! నన్నుమన్నింపుము. నీవేల వెన్నంటెదవు? మన దేశము మహా క్లిష్టపరిస్థితిలోనున్నది. మహారాజునకు సర్వవిధముల మీతోడ్పాటు జూపి దేశమునుద్ధరింపుడు. నాకొక చింతమాత్రము బాధించుచున్నది.

దేశమును బాసి పోవచిం • తింపగాని
పావనంబగు మహారాష్ట్ర • వంశమునకు

తీరని కళంకమును గూర్చి • తినని మాత్ర
మేనుకృశియింతు జీవాంత • మైనదాక.

తానాజి

సుహృద్రత్నమా! నీవీదుష్కార్యమొనర్ప లేదని నాకు బాగుగ తెలియును. సూర్యాజీసోదరుడు వచించిన దెంతయు సమంజసము. నామనస్సాక్షి నీవు నిరపరాధివని వేయిమారులు వచించుచున్నది. పాపమాతురుష్కునకీయింద్రజాలము తెలియదు. నీపై గలయసూయచే నెవడో దురాత్ముడీ పన్నాగమంతయు బన్నినాడు. నన్ను నీతో రాసియవా? ఎంతకఠినాత్ముడవు. ఓహో నీవు కఠినాత్ముడవా? కావు, కావు, నేనపచారముగావించితిని. (మనసులో) నన్నెట్టులయిన ఈతడు గాసియడు. పరుల కష్టమునోర్వలేని స్వభావమితనిది. ఓసర్వజగదంతర్యామి! సర్వేశ్వరా!!

పరులకష్టముజూచి • భరియింప జాలక
సాయమ్ము నెరపెడి • న్యాయమూర్తి
నాలుక తెగిపడి • నక స్వప్న మందేని
అనృతమ్ము లేనిస • త్యవ్రతుండు
అనయమ్ము దేశసే • వార్థియై బహుదుర్గ
విజయముల్ గాంచిన • వీరవరుడు
స్వామిభక్తి ప్రద • ర్శనమున తనప్రాణ
ధనముల జూడని • త్యాగశీలు

డకట! దుర్విధి బలవిధా • నానుసరణ
కలిత దేశాంత వాసశి • క్షావిధంబు
శాసితంబైన మాత్రుదే • శమ్ముపీడి
పోవుచున్నాడు నీవెట్లు • కావ గలవో?.

రఘునాధా! నీవెప్పుడును మహారాష్ట్రజాతికి కళంక ప్రాయుడవని తలపబోకుము. నిజముగా నీవు శిరోభూష ణమగుట అతిశయోక్తి కాదు. నీపై నీదురభియోగమును బన్నిన కలుషాత్ముని కనుగొని చిత్రవధగావింతుము. జాబిల్లిపైని మేఘపంక్తులవలె సజ్జనసంకటములు నస్వ రమపరిసిపోవును.

సేవకుడు ప్రవేశము.

అయ్యా, ఆలస్యమగుచున్నది. ప్రభునియాజ్ఞ మీార రాదు.

(రఘునాదుడు ఖడ్గము కవచము శిరస్త్రాణము త్రాల గించును) సోదరవీరులారా! నాకు శలవొసంగుడు.

సోదరునిరీతి నిన్నాళు • లాదరించి
నారు ఏలోపమేని యొ • నర్చియున్న
నర క్షమింపుడు, చూతుమే • నాటికైన
నాదు నిరపరాధమ్ముగ • న్పడిన యెడల.

(నిమీలితలోచనుడై)

కాలము చాలిపారక అ• కారణమానభియోగమొుందునా
పాలబడెక్ మరేమెయిుగ• పాపము, నీచరణమ్ములాన ఏ

రఘునాథ్

లీలను జేసినాడనో చ • లింపక నీదగుసేవ, అంతియే
చాలెను నేటితో శలవో • సంగుము పంపుమమాత్ృదేశమా!.

అన్నలారా! నేబోయివచ్చెద. జనార్దనజీ! నీవేలపలు కాడలేక. నిర్ఘాంతుడవై చూచెదవు. ప్రబలకారణములతో నాపైనీయభియోగము తేబడినను ప్రేమబంధముల ప్రెంపకుండుట ధీరలక్షణము గాదు.

చందర్‌రావు (తనలో)

దైవమా! నాప్రయత్నమున సఫలుండనైతిని. మహారాజునకు నాయం దనుగ్రహము కలిగినది. వీరెంత నాయెడల నసూయగానున్నను, ఒకనాడందరకును తల మానికమనై శోభింపగలను. (నిష్క్రమించును.)

సూర్యాజి

నన్నిట నేవదలి పోయెదవా? రఘునాథా......

(రఘునాథుడు తోడివీరులదీనత్వమునకు జాలిపడియు ధీరలక్షణములతో నిష్క్రమించును.)

———

## తృతీయాంకము - తృతీయరంగము

(ఉద్యానవనములో సాయంకాలమైనది. పడమటికి జారిపోయే సూర్యునికాంతి రమణీయమగు తనప్రకాశముతో వనమున కంతేయు నొకక్రొత్త మెరుగుపెట్టినది. ఒంకొంటి నొరసుకొనుచూ నూతన వికాసముతో పరుగెత్తిపోయే పలుచని మేఘశకలములు, జరీపనిచే సినట్లున్న తమసౌందర్యమును అచ్చటనున్న కొలనిలో ఒక్కసారి తొంగిచూచి నై. ఆదక్షిణపుగాలికి పూవులు రాలిపోవుచున్నను ను వాసనల వెట్లుపంచిపెట్టుచున్నవో ఆరహస్యమును తద్వనచరురా లయ్యు నామెవాటి యాదర్శకజీవితము నర్థముచేసుకొనుస్థితిలో లేదు. ఆమెసరళ, ఒకమాలతీ మంటపముదరివియోగభారాలస యట్లుశ్వా సములు విడచుచు తలపోయుచున్నది)

దైవమా ! నీహృదయము కఠినశిలాకల్పితము. నీసృష్టి దయారహితము. సజ్జనసంకటములగల్పించుటలో నీనైపుణ్య మద్వితీయము. ఓహో! పొరపడి యనవసర ముగ నాసర్వేశ్వరుని దూరనేల? ఎవ్వరికర్మఫలము వారనుభవింపక తీరదుగదా! రఘునాథా!......రఘు నాథా! నీకుదేశాంతవాసశిక్షయే. నీవేమియపరాధము గావించితివోయి, శివాజీరాజేంద్రుడు దురాలోచన లేని వాడా? నీవాతని కమితవిశ్వాస పాత్రుడవే, ఏమైన నేమిలాభము.విధివిధానముదాటరానిది హా!రఘునాథా!

శారదచంద్రికాయుతని • శాసమయ్యమున అల్లనాడు వి స్ఫారితలోచనాంతముల•జాలొనుపిన్నవినవ్వుతోడ, నీ

హారమి దేమరాళగమ♦నా! గ్రహియింపుము వీడివచ్చితీ
వాగమణీయ పుష్పవన♦మం''దనిమౌక్తికమాలనీయవో!

ఆహా! ఆతని వచోరచనాచణత్వ మెంత రసోద్దీపక
ముగనున్నది. ఆతని సత్శీలదయావిలాసములు స్మర
ణీయములు. "నీహారము పుష్పవనమున మరచివచ్చితి
మరాళగమనా!" యనిసంబోధించి యొసంగెను. ఎంత
దయార్ద్రహృదయము. కొంచెముగనైన నా చనువుచే
నాతడు గంభీరత వహింపక తన సహృదయభావమును
ప్రకటించినాడు. (నిస్పృహతో) ఇకేటియాస. విధి
నాయెడ కేవల ప్రతికూలుడు. అట్టి త్రిజగత్సమ్మోహన
మోహనాకారము, అట్టి సకల వీరదుర్నివారదోస్సార
పరికల్పిత వీరరసైకమూర్తి, నీకరతలామలకమగునని
యువ్విళ్ళూరుచుంటివా ?

కలుగునే రఘునాథ ♦ గాఢసమాశ్లేష
ణమ్మునీ తనవు కే ♦ నాటికైన
అమరునే ప్రాణేశు ♦ నలఘుపాదాంబుజ
తత్పరసేవహ ♦ స్తముల కెలమి
కాంచునే రమణీయ ♦ కమనీయమోహనా
కారమ్ము నా కండ్లు ♦ కరవుదీర
ఆలకించునె మధు ♦ రామృత నిష్యంద
భాషణమ్ముల శ్రవః ♦ పాళిసెలగి
యక్షగంధర్వసిద్ధ సా ♦ ధ్యామరేంద్ర
వినుత కాంతాజనాసాధ్య ♦ విమలగాత్రు

డేడ ? ఆతని వరియించు • టేడ ? అకట !
కష్టసాధ్యమ్ము సిద్ధ సం • కల్పనాట.

ఆహా ! నా పెన్నిధానమును గోలుపోయితిని. నా కేది తెరవు? ఏమి యా దివ్యసుందర విగ్రహుని లావణ్యము...... ఆ మోహనాకారమిప్పటికిని నామానసిక దర్పణమున ప్రతిబింబించుచునే యున్నది.

ఏ శూరశేఖరుడు మన్మనోకాసార విహారరాజహంస యో, ఏ సౌందర్యరాశి నా యౌవన పుష్పవాటికా వసంతమూర్తియో, దైవమా! ఆతనినే నానుండి వేరొనర్చితివి. నాపై నీకింత పగయేల ? నీ రూక్షేక్షణ ప్రసారముల కీ దీనకాంత, ఈ స్థిరసంకల్ప. ఈ పతిప్రాణయే గురియయ్యెనా ? (మల్లికామంటపమున మేను వాల్చును)

కమల (ప్రవేశము.)

నాప్రాణసఖి సరళ రఘునాథుని దేశభ్రష్టుని గావించి రను శిక్ష నాలించుటయే మొదలు నానాటికిని కృశించుచున్నది. ఆతడు దేశభ్రష్టుడై నాలుగు మాసములు దాటినవి. ఎచటికిబోయినదియు తెలియరాదు. ఈ యమప్రేమ రఘునాథునియందు నిగూఢమై, నిరుపమానమై దనరుచున్నది. అంతటి ప్రేమసంకల్పము నాశనము జేయుట పాపకరము. పాప మీ యుపవనమునకు జేరుకొని యుండును. (వెతుకకొనుచు మల్లికామంటపాంతర మూర్ఛితయగు సరళనుచూచి) అయ్యో !

ఎంత మనోవ్యాకులమున నీమె కుమిలిపోవుచున్నది. ఈ తీవ్ర నిశ్వాసములచే చిరుచెమ్మటలు పోసినవి గావలయు.

(సపర్యచేయుచు చెంతకూర్చొనును)

(రఘునాథుడు కషాయవల్కలముతో, నిర్వేదముతో, వనాంతరములోనికి చేరుకున్నాడు.)

అకటా! కర్మఫల ప్రభావము విప • ర్యాసమ్ముగాదోచు తావక సేవాపరజీవితమ్ము గడుపగ • భాగ్యంబు లేదయ్యె, నే నిక సేయందగు కార్యమీ యవనిపై • నేముండు, దుష్కీర్తి వ్యాపకమయ్యెగ మహారాష్ట్ర దేశజననీ! • భారమ్ము ఈ జీవముల్.

ఓ మాతృదేశమా! నిన్ను గొల్చు భాగ్యరేఖలు మాసిపోయినవి. భవత్సేవాపరాయత్త జీవితము నాజన్మాంతరమున నేనిని కలుగనేరదు. నాపై మోపబడిన యీ దురభియోగము పూర్వపక్షము సేయ ప్రయత్నించియు విఫలుడనే నైనాను. నా ప్రభువు ... నా శివాజీ రాజేశ్వరుని మన్ననలనందదగు నదృష్టము భగ్నమైనది.

ఓ మహారాష్ట్ర కులపావన చరిత్రా! దోర్విక్రమాటోప వినిర్జిత గాంగేయా! నా విశ్వాసము, నా ప్రభుభక్తి నా దేశానురాగము నెరిగినవాడవయ్యు నిట్టి చెట్టబట్టింతువా? ప్రభూ! నన్ను క్షమింపుము. నేరస్థాపనకు ప్రబల కారణములు నిరూపింపబడుటచే నీవిట్లు శిక్షించితివి. ఎంతకాల మీ సన్యాసివేసమున మసలవలయును? తన దేశమునకును తన ప్రభువునకునుగాని శరీరము ఈ యవనీతలమున సజీవములై యుండుటకన్న మహోజ్జ్వలా

నల కీలాహుతమై శాశ్వత శాంతి వహించుట కరము శ్రేయస్కరము.

హృదయమా! ఏటియీ వేదనము? కష్టసమయముల యందే నీ ధీరత్వమును గన్పరచుట కవకాశము. నిజ వేషము మారి నాలుగు మాసములైనవి. ఆ మధురా వనాంతరావాస మానందదాయకమయ్యె, నాహృదయము మాతృదేశమువైపునకును, హృదయేశ్వరి వైపునకును ఆకర్షింప బడుచున్నది. నా కింకేమి మిగిలి యున్నది. అంధకార గర్భమున హోరుగాలిలో సంక్షుభితమగుచున్న మహోదధి తరంగములమధ్య నావబగిలి పోయిన ప్రయాణీకున కెవ్వరుగతి...?

ఇది తుదిసారిగా ఈమె సమావేశము నపేక్షించితిని. ఆవిలాసిని యభీష్టముగూడ నా దురదృష్ట ఫలితాంశము గనే పరిణమించినచో ఈతనువు లరణ్యముననే జీర్ణించి పోవును. సాయంసమయ విహారముకొఱకు నా దేవి యటకు వచ్చును, నాభాగ్యముపండును. నావలపు తెలియుట కీవేషమెంతయు నుపకరించునుగాక! చమురొలికిసి పోయినదీపిక గాలిలో పెట్టబడినది. ఆరునో మండునో... సంశయింపను కూడదు.

నను దవ్వులనుజూచి • నాతి సంశయ భావ
మంకురింపగ బొమ • లట్టె నిలిపె
నన్నెల్లరును 'రఘునాధు' • డందురటన్న
తళుకు వాల్జూపుల • తరుణిచూచె

తన్వి 'యుండు'డటన్న • దయకుపాత్రుడనౌదు
నంటి సిగ్గొందె వా • ల్గంటియపుడు
వదలిపోలేనట్లు • ప్రణయరసోదీర్ణ
వదనమ్ముతో నన్ను • బాసిపోయె
ఆశుభాంగి మృణాళ బా • హాంతరాళ
డోలికా శయనమ్మొ, న • న్నేలకున్న
తద్వియోగ మహానలో • ద్యచ్ఛిఖాళి
కాహుతిగ తనువొసగుటో • యగునుపిదప.

విచ్ఛిన్నమనస్కుడనై ధీరత్వముచెడి యనేక విధముల చింతించెదను. నా దక్షిణనేత్ర మదరుచున్నది. ఇది శుభసూచకమె. నా దేవి యట కాన్పించును. నన్న నుగ్రహించును. ఈ ప్రశాంత సమావేశము మజ్జీవిత ఫలాఫల సమస్యల పరిష్కరింపనున్నది. నా ప్రియాన్వేషణమున కీప్రకృతివలన నిరోధము కలుగకుండ నుపాసించెదను.

తరుపత్రమర్మర • ధ్వనిగాగ కదలింతు
మానుమా, చెవిపీడ • మందపవన !
అనటితోటల క్రేవ • లంటి ఘోషించుచు
ప్రవహింపకుమ, నిర్ఝ • రంబ ! నీవు
కలకలారావ సం • కులమొనర్పకుడు కొం
త తడవించుక శకుం • తమ్ములార !
తరుణారుణచ్ఛటా • దర్పితమ్మగు సాంధ్య
రాగంబ! తీక్ష్ణవై • రమ్యమాను

ప్రాణసతిజాడ లెరుగ నా • యత్నమైతి
అంతరాయమ్ముగల్పింప • కమలమతిని
సాయమొనరింప దగు కటా • క్షమువహించి
సర్వభ్రష్టుండితండు ని • స్సంశయంబు.

(అటునిటు తిరిగిచూచి)

ఎందును గాన్పింపదే. ఈ దినము వనమునకే రాక యుండును. ఇంత ప్రయాసపడి వచ్చినను వృధయైనది. ఈ ప్రయాణము నా దేశమునకును, ప్రియురాలికిని, తుదిదర్శనముగనే మార్చినది. నాయాశలు నిరాశయైన వి. పూర్వమార్గానుసరణమే కర్తవ్యము.

వెతకి వేసారి దౌర్భాగ్య • విధిదలంచి
చివర చూపైనకలుగని • చింతచేత
వదలిపోయె ప్రియుండని • సుదతితోడ
దయనుదెల్పుడు వనదైవ • తమ్ములార!.

(తిరిగిపోవుచు మల్లికామంట పాంతరమున సఖీసపర్య తోనున్న ఒక యువతిని జూచును)

(ఆశ్చర్యముతో)

ఎవరచ్చట ? ఒక కాంతామణి ఆ మంటపమున దీనాననయై,కృశాంగియై యొరగిలబరుండి దీర్ఘముగ నిశ్వసించుచున్నది. ఈమె సంతాపభారాలసనిస్పృహయై, కుంచుకొనిపోవుచున్నది. ఒక యౌవని దుఃఖాశ్రువుల తో సపర్యసేయుచున్నది. మచ్చిత్తహారిణి సరళాదేవి కాదుగదా...?

సరళ (నిదురలో)

రఘునాథా! పోకుము. పోకుము. నా కీ చిరబ్రహ్మ చర్యమునే విధించితివా?

కమల

ఏమిది? ఈయమ పలువరించుచున్నది. (సరళ వీపు తట్టును) సరళా! సరళా! ఏమిది! లెమ్ము. ఎంతవెఱ్ఱిబాగు లదానవమ్మా.

రఘునాథుడు (చెట్టుమరుగునకు చేరును)

వీరలేదో మాటాడుకొనుచున్నారు. ఆమె విచార మునకు కారణము తెలియునుగాక. నేనిచ్చటనేయుండి సాంగముగ నాలించెదను.

సరళ (త్రుళ్ళిపడి)

అయ్యో! రఘునాథా! నీకెంతటి యాపత్తు సంఘటించి నది?

కమల (తనలో)

నన్నీమె రఘునాథుడని భ్రమించుచుండెనా యేమి? (ప్రకా) అమ్మా! నేను కమలను. విచారపడిన ప్రయోజనము లేదు. ఆత డిదివరకెన్నియో యామడల దూరమున, ఏ మహీధరగుహాంతరాళముల నీయవమా నము భరింపలేక జీవితమును గడుపుచున్నాడో.

రఘునాథుడు (వినుట నభినయించి)

ఆమె సరళ, పలువరించుచున్నది. రఘునాథా! ఎంత టివిపత్తు నీకు సంఘటించినది! యని త్రుళ్ళిపడిలేచినది.

రఘునాథ్

అదిగో కమల యోదార్చుచున్నది. ఆ రఘునాథు డెవరు? ఆతనినిగూర్చి యీమె కింతవిచార మెందులకు? ఇది సందేహాస్పదము.

సరళ

గుహాంతర సీమల వసించుటయే; (మతిలేక) ఎవరు? నీవబద్ధ మాడుచున్నావు. ఆతడిచ్చటనే యున్నాడు. అడుగో!

రఘునాథ్

నన్నీమె పోల్చినదా యేమి? ఆరఘునాథు డీయభాగ్యుడు కాడుగదా? నాకీమెస్థితి వింతగా దోచుచున్నది.

కమల

సరళా! నీ నిదురమైకముపోయి స్పృహరాలేదా? ప్రొద్దైన క్రుంకలేదు. సాయంసమయమున నిదురయేమి? నీ కొకటే ధ్యానము. అటు చూడుము. తెలిమొగిలు మొత్తమ్ములు బంగరుజరీపని చేసినటు లొప్పు సాంధ్య సంపద.

సరళ (నిస్పృహతో)

నా కేమియు రుచింపవు పొమ్ము....

కమల

ఈమె నెట్లోదార్తును?

సరళ (స్పృహతో)

కమలా! ఎప్పుడు వచ్చితివె. వాని జాడ యేమేని

తెలిసినదా? ఒక్కమారు నా కన్నుల పండువుగ చూపింపవుగా?.

క మ ల

ఇంకెక్కడ నున్నాడు. ఏమార్గమున బోయెనని వెతుకగలము. నీది పవిత్ర ప్రేమయయ్యేనేని, అది భగవత్ప్రీతికరమేని తప్పక ఆతని నిరపరాధిత్వము బయల్పడి మహారాజుచేతనే రావింపబడును.

సరళ (ఆతురతతో)

నిజమంతియేనా? అటులైన నాప్రేమ పరమపవిత్రము కావున భగవత్ప్రీతికరము.

రఘునాథ్

ఓహో! నిరపరాధిత్వము బయల్పడుట, తిరిగి మహారాజుచేతనే రావింపబడుటయా—ధన్యుడను. ధన్యుడను. ఈప్రశంసయంతయు నీ యభాగ్యుని గూర్చియే. నిక్కముగ నన్నిమె వలచినది. నావియోగమీమెకింత విషమావస్థను ప్రాపింపజేసినదా? ఛీ! రఘునాథా! నీవెంతక్రూరుడవు. నీవలన ఎందరెందరాప్తులు తీరరాని వ్యధలకు గురియైరి.

వెతలఁ ముంచితి తోటి వీరవరులఁ • విశ్వాసహీనుండటం
చతిగాక్షోభిలెరాజు,దుర్యశమిలఁ వ్యాపించె,ప్రేమించిసం
తత సౌఖ్యా గమనమ్ముగోరు సతి న • న్యాయమ్ముగా [నాదరిం
చితివో జీవితమా! కఠోరమతివై • ఛీ! ఎంతపాపిష్టివే.

ర ఘు నా ధ్

ఇంతగ పలవించు నామ్రేమ సూత్రానుబంధము నెరుంగ బయల్పడెదను. [వారిని చేరబోవును]

స ర ళ

కమలా! అటుచూడుము. ఎవ్వరా యోగిసత్తముడు? ఇటేవచ్చుచున్నాడు. వ్యథా ఖిన్నమై మూర్తీభవించిన శృంగార దేవతవలె నున్నాడు.

కలువపూరేకుల • దొలుకు కర్ణాంతిక
వ్యాపిత నేత్రద్వ • యమ్ము దసర
జడలుగట్టిన కురుల్ • మెడమీద వ్రేలుచు
ఒకవింత సౌందర్య • మొలుకుచుండ
ఆపాదలంబిత • మైన కాషాయాంబ
రమెవిలువయగు వ • స్త్రముగ మెఱయ
స్వర్ణ కాంతులు, పరి • శ్రమచేతగాబోలు
నవనవస్నిగ్ధ భా • హువులతోడ
తపసి వేసము దాల్చిన • తరుణ యౌవ
నప్రభానీతమన్మథా • నవ్య దివ్య
మూర్తి యోయన బొల్చునీ • పుణ్యుడెవరొ?
చూడుమా! వచ్చుచుండె ఈ • జాడలందు.

ఏమికారణమోగాని, ఆమునివరుని జూచుటతోడనే నా కపూర్వమగు భక్తిప్రపత్తులుదయించు చున్నవి. ఆ తేజశ్శాలి నామనోహరునిగూర్చి ఏమేనిజోస్యము వచించునేమో. రానిమ్ము. నీవే కొంచెమడిగిచూడవే.

కమల (స్వగతము)

ఈమె ప్రేమయెంత నిర్మలమైనది. రఘునాధుని సందర్శనమెట్లును లభింపదు. ఈయమ హృదయమును మరల్చుటయు దుస్సాధ్యము. తుదకేమి కానున్నదో.

గోస్వామి (సమీపించుచు)

రఘునాధా!

పొరపడినోరుజారకుము• మోహవశమ్మున నీయుదంతమా
తరుణిభవద్వియోగమునెందఱిదలపోసికృశించునేమొకో,
శరభమదేభ సింహముఖ• సంకుల క్రూరమృగాటవీస్థలుల్
భరమననేగమించునొకో• వారక నీవెను వెంటనయ్యయో!!

అకారణముగ నీ ఘోర పాపమునకు గూడ దలపడకుము. నీపాపపరిపాక ఫలమే నిన్నింత యధోగతుని గావించినది. నీవు లేకున్న జీవములేని పరిత్యజించునంతవియోగా వస్థయందున్న కుసుమకోమలినేల యడ వులపాలు గావించెదవు.

సరళ, కమలయు.

మహానుభావా! నమస్కారములు. తామిందు దయ చేయుడు.

(గోస్వామి మంటపముపై ఆసీనుడగును.)

గోస్వామి

అభీష్టావాప్తిరస్తు.

కమల (సరళ వైపుతిరిగి)

తథాస్తు చెలీ! ఈయోగీశ్వరుని యాశీర్వాదము భావి ఫలారంభ సూచకము.

సరళ

స్వామీ! అవ్యాజముగ గలిగిన మీపవిత్ర సందర్శనమున మేముధన్యులమైతిమి. ప్రభావసంపన్నులగు దేవరనామధేయ మెరుఁగ వచ్చునా?

గోస్వామి (స్వగతము)

సతీ! నానామధేయము నీకుచిరపరిచిత మైనదియు, ప్రస్తుతనీవిషమావస్థకు కారణభూత మైనదియునై యున్నను, ఈమోసగాని కృత్రిమవేసమును జూచి నిరూపింపలేకున్నావు. (ప్రకా) నాపేరుగోస్వామి యనెదరు. నీవింతటి విచారభారమున మునిగియుండ గతమేమి? ఎవ్వరితనయవు?

(సరళ కన్నీరొత్తుకొనుచు)

ఈనిర్భాగ్యురాలియుదంతము వినతగనిది. ఎవరితనయనైననేమి ప్రయోజనము. (నిశ్వాసము) నాకేదేని తారకమంత్ర ముపదేశింపుడు.

గోస్వామి

చెప్పుముఅంతటియధైర్యమేల? భగవదిచ్ఛ యుండునేని యేప్రయత్నములు మానవాసాధ్యములు. విచారమందినఫలమేమి? నీకోమల శరీరమునేల యకారణముగ దుఃఖభాజనన మొనర్చి అలయించెదవు?

కమల

స్వామీ! తాముసర్వజ్ఞులు. మానెచ్చెలిహృదయతాపనివారణ మగునట్లనుగ్రహింపుడు.

సరళ

స్వామీ! ఈజీవితమె భారమగుచున్నది.

గోస్వామి (యోచించి)

అబలా! నీవుత్త అమాయకురాలవు. నీవిచారకారణము తెలిసినది. ప్రియుని వియోగమునకై యిట్లుకృశించుచున్నావు.

కమల

చూచితివే. నీమనోభావము వారికెంతసుగ్రాహ్యముగనున్నదో, దివ్య దృష్టికి గోచరించున దంతయు చెప్పనిమ్ము.

సరళ

స్వామీ! నాప్రియుడు నన్నేలుకొనునా? ఆతడెచ్చటనున్నను సరియె, నన్ను తనహృదయేశ్వరినిగా ననుగ్రహించిన నాజన్మము తరించును.

గోస్వామి

అతడు అత్యంత శూరుడు. దేశభక్తిపరాయణుడు.

సరళ

ఔను. ఏమిప్రయోజనము. సర్వము విధిప్రాబల్యము.

కమల

చెలీ! ఇంకొకటి యడుగవలయును. ఇది యంతయు

నీముఖ భావమునుబట్టి తెలిసికొనెనందుము. ఆతనిపేరు, ఎన్నడేనిముందు నిన్నుచేపట్టు నదృష్టముకలదో లేదో తెలిసికొనవలయును.

మునివరా! పరీక్షయని తలపకుడు. మన్నింపుడు. నాప్రాణసఖి ధైర్యమునకై ప్రశ్నించెదను. అతనినామ ధేయమేమి? అతడెన్నడేని ఈయమ దురవస్థను బాపిమ న్నింపగలడా? శ్రమగల్పించి నందులకు క్షమింప వేడె దను.

గోస్వామి

కన్యారత్నములారా! మీదీనావస్థ నాకు కడుజాలి కరముగానున్నది. అతని నామధేయమా? (ఆలోచించి) అదితెల్పిననామె కింకను మనోవ్యధ గలిగించిన పాపము నందువాడ నగుదు నేమో?

సరళ

లేదుస్వామీ! లేదు కర్ణపేయముగవిని ఆతనిలో నైక్య మయ్యెదను.

గోస్వామి

ఏమిలాభము. బాలా! ఆతనిని రఘునాధుడని పిలి చెదరు.

సరళ

హా!రఘునాధా! రఘునాధా! నీవుదక్క నాకీప్రపంచ మున నింకేమి మిగిలి యున్నది. అట్టి నిన్ను మనసార

పల్కరించి యేని, కన్నార తిలకించి యేని, ఎఱుగనే. ఎంత యభాగ్యురాలను. (మూర్ఛితయగును)

గోస్వామి

ఇది భరింపరానిది- భరింపరానిది- నాకున్నవిచార మున మ్రగ్గిపోక లేనిపోనివ్యధ కలిగించితిని. కలిగించు కొంటిని.

(సరళ లేచును)

నీప్రియుడు నీకు సందర్శన మొసగగలడు. హృదయ పూర్వకముగ ప్రేమించిన వారిప్రేమ నాశనము జెందదు. కార్యసిద్ధి కాకపోదు.

సరళ

ఆతనిపై మోపబడిన నేరమున కాతడెంతవరకు సం బంధించి యున్నాడు? (తనలో) యోగి యేమనునో?

గోస్వామి

ఆ నేరమునకును, ఆతనికిని ఏమాత్రము సంబంధము లేదు.?

సరళ

మఱెవరు గల్పించిరి. కారణమేమి?

గోస్వామి

చందర్ రావనుమహా రాష్ట్ర సేనాని మహమ్మదీయసర్దా రునినుండి లంచముదిని కృత్రిమస్నేహమున ఆతనిపై శివాజీరాజేశ్వరునికిగల యభిమానగౌరవముల కసూయా పరుడై ఈ తాంత్రికమును బన్నినట్లు తోచుచున్నది.

కమల

నేను కొంచెము చూచాయగా నిశ్చైవినియున్నాను. శివాజీరాజు, తానాజి సూర్యాజీలనుపరిశోధనకునియమిం చినారు. వారీచందర్ రావే కారకుడని నిరూపించినారట.

సరళ

కమలా! నాతో ఈ విషయమేల చెప్పవైతివే.

కమల

ఆవిషయముపూర్ణముగ నిరూపించలేదు. అందులకే నీకుచెప్పలేదు.

సరళ

స్వామి! ఆతడు తననిరపరాధిత్వము నిరూపించుకొ నుటకై నప్రయత్నింపడా? అకారణముగ శిక్షననుభవించు నా ? కష్టమెట్లున్నను అపయశమును రూపుమాపుట కేని యత్నింపవలసిన దే?

గోస్వామి

ఔను, మొన్నరఘునాధుడనుపేరుగల వీరుడొకడు నాకడకువచ్చెను. వికాసవంతమైన ఆయన నేత్రములలోని కాంతి స్థంభించియున్నది. పదభ్రష్టుడగు మహారాజువలె నాతడుకనుపించినాడు. ప్రసంగమధ్యమున, తనహృద యము నెవతయో అప్సరఃకన్యహరించినదనియు, దేశ భ్రష్టుడగు తన ఆయాసమాయావని బాహువల్లరీ శయనమున నెప్పుడుశమించుననియు; దీనముగా నన్నుప్ర శ్నించినాడు. నీ ప్రియురాలు చేకూరును వగవకుమని

యూరడించితిని. ఆరఘునాధుని చరిత్రమునకు నీయవస్థసరి పోవుచున్నదే!

సరళ

చిత్తము. అందుల కాతడేమనెను. ఆతనిముఖచిహ్నములెట్లు పరివర్తనమయ్యెను?

గోస్వామి

చిరునగవు పెదవులపైకివచ్చి విచారముతో నాగిపోయెను. పాప మీదుర్యశము భరింపలేక యిట్లన్నాడు. "నాయభియోగమునందలి సత్యమును నిరూపింపయత్నించెదను. అందు విఫలుడనయ్యెదనేని నా దేశమునకును, నాప్రభువునకును, నాప్రేయురాలికిని దూరస్థుడనే యగుదును".

సరళ

నాధా! రఘునాధా! నీసంకల్పము ధర్మబద్ధము. నీదేశానురాగము, ప్రభుభక్తియు గణనీయములు. ఇట్టి మహోదార స్వభావుడు నాప్రాణభర్తయైనందులకెంత యుధన్యను. మేలువీరపుంగవా! మేలు. నీకుసతీప్రణయము, దేశభక్తి, ప్రభుసేవ, యను నీ మూడును సమాన ధర్మములు. నీహృదయపూర్వకమగు ననురాగమంతయు నీ మాటియందును లగ్నమై యున్నది.

ఈ సమస్యలను ధర్మబద్ధముగ పరిష్కరింపవలసి వచ్చినప్పుడు ప్రభువునెడ, దేశమునెడగల భక్తిని మలినీభూతము గావించిన అపయశమును రూపుమాపక,

కేవలము నీ ప్రియురాలికై కక్కురితి పడవు. అట్టి నిగ్రహశక్తి నీయందు వెలుగుచున్నది. నాకునదియ సమ్మతము. స్వామీ! ఇంకేమేని వచించెనా? తన యభియోగమును పూర్వపక్షము సేయ సమర్థుడగునా?

గోస్వామి (స్వగ)

ఈమె నెంతయో కాలము వ్యధాభారమున క్రుంగజేయను. (ప్రకా) అతడు తన ప్రయత్నమున సఫలుండగునని తోచదు.

సరళ

ఎప్పుడైన భూదర్శనమున కేని రాగలనని చెప్పెనా?

గోస్వామి

చెప్పియే వెళ్ళెను. మరల నే నా ప్రాంతములకు వెళ్లునప్పటికి రాగలడు. ఒకవేళ నాతడు కలియుచో నీసందేశమేమిగా వచింపుమనెదవు?

సరళ (స్వగ)

హృదయమా! ధీరత్వముతో, పతిప్రాణవగు నీవు నీహృదయవల్లభునకు యోగ్యమును, అమూల్యమును నగు సందేశము నంపుము. అరణ్యావాసియై కృశించిపోవు ఆయన దుఃఖము ద్విగుణీకరింపకుము. (ప్రకా) స్వామీ ! నేడు మీకు చాల శ్రమగల్పించితిని. నా పూర్వకముగ ఆమోహనున కిట్లు వచింపుడు.

వనసీమ నలనాడు • గనిమోహావశత వి
మోగసంతప్తయా • చుండెననుడు

కఠినశిక్షాప్రాప్తి • కలిగెనంచునువిని
నిలువు స్థిరైపోయె • పొలతియనుడు
తనువులు వేరైన • తగ్గప్రాణ మొక్కటే
యని స్థిరసంకల్ప • యయ్యెననుడు
ఆత్మ గౌరవదృష్టి • యవసరంబేకాని
మోహంమొక్కటె చూడ • బోలదనుడు
చివికి జీర్ణించి తుదకుని • శ్చింతతోడ
ప్రియునకై నాదు దేహము • ర్పింతుననుడు
నిరపరాధిత్వముఁ దెల్ప • నేరఁడేని
ప్రథిత నిజఖడ్గమదియ శ • రణ్యమనుడు.

గోస్వామి (గర్వపాటుతో తనలో)

సెహభాస్! సతీ! సెహభాస్! నీవంటి ధన్యచరిత్ర నా యర్ధాంగియగుటకే నెంత పున్నెమొనర్చియుంటినో అట్టి నీతో ... ... నీతో సుఖించు భాగ్యము లేదు గదా! (తలవంచుకొని యుండును.)

సరళ (గద్గదముతో)

స్వామీ! మరచిపోక, జ్ఞప్తియందుంచుకొని, శ్రమయనక మన్నించి ఈసందేశ మందింపుడు.

గోస్వామి (తనలో)

నాదుఃఖము, నానిస్పృహ, నాప్రణయము, కంఠదఘ్నమైనవి. నేనేమియు బలుకజాలను. నేనిట నుండజాలను. (ప్రకా) అట్లే చెప్పెదను. నేబోయివత్తును. (నడచు చున్నాడు).

సరళ

స్వామీ ! ఈ దాసురాలు మరల మరల ప్రార్థించుచున్నది. తప్పక ఈసందేశము నందింపుడు.

కమల

దేవా! మాకు శలవొసంగుడు. (గోస్వామి అదృశ్యుడగును.)

సరళ

సఖి! ఆమహానుభావు డదృశ్యుడయ్యెనే. ప్రియుడీ సందేశము నాలించి కరుణాహృదయునిగ దలంపడు గదా. శ్రమయనక నేనే ఆయన వెనువెంట బోయి నాథుని దర్శింతునా? ఆతడెంత దూరముబోయెనో? కమలా! రమ్ము పోవుదము.

కమల—(తనలో)

అయ్యో! ఇది యేమిసాహసము. వియోగార్తయై కృశించిన యంగవల్లికతో, కాలినడకతో ఈమె యెన్ని యామడలు నడువగలదు. వలదని వారించెదను (ప్రకా) నెచ్చెలీ! సరళా! పోకుము—పోకుము, సాహసింపకుము. నీవు నడువజాలవు. అపుడే కాళ్ళు తడబడుచున్నవి. నీకు శుభమే యగును. ఏటి యధైర్యము. భోజనమేని యొనర్పక నీ యకాల ప్రయాణమేమి?

రఘునాథ్

సరళ

వలదు. జనకుడు వారించును. నామాట వినుము. నాకు భోజనము వలదు. ప్రపంచము వలదు. సర్వరక్షకుడా జగన్నాథుడు కలడు—నాథుడు కలడు— (సరళ పోవుచుండును కమల వెన్నంటును.)



# ర ఘు నా ధ్.

## చ తు ర్థా ౦ క ము.

### ప్రథమ రంగము.

(ప్రతాపగడ సింహద్వారమువద్ద శుక్లపక్ష పంచమినాడు లేత వెన్నెల కాయుచున్నది. చుట్టు చెట్లు, ఆకులతో కప్పబడిన సామాన్యమైన గృహములు అస్పష్టముగ కనుపించుచున్నవి. సమీపమునందలి యడవులలోని క్రూర మృగముల సందడి వినవచ్చుచున్నది. ఆదృశ్యమునాటి అడవిపల్లెల భయంకరనివాసమును, అమాయిక జీవనమును, వెల్లడించుచుండెను. సింహద్వారము ముందు శివాజీ సవిచారముగా పచారు సేయుచున్నాడు.)

నే నెంత కఠినాత్ముడను! ఎంత విశ్వాసఘాతకుడను, నాయీ అపఖ్యాతి జగతీవలయమెల్ల నలముకొనియెను, రఘునాధునిబోలు రాజభక్తి పరాయణుని, దేశభ్రష్ట శిక్షావిధానమునకు గురియొనర్చిన నా కపయశముగాక మరేమి ప్రాప్తించగలదు. లేదు. అతనియెడల దోషము లేదని యెట్లు తలపనగును? ఆతని చేవ్రాలుగల లేఖ యగుపడునంతవరకును ద్రోహియే యగుట నిస్సంశయము. అతని కెవ్వరునువిరోధులును లేరుగదా. ఎవరు కల్పించి యుందురు? సూర్యాజి తానాజీల నీ విషయ పరిశోధనమునకు నియోగించితిని. చందర్ రావున కిందు సంబంధ మున్నదనియే నిశ్చయించినారట. త్వర

పడి వారట్లు నిశ్చయింపరు. నా మనస్తాపము హెచ్చు గుచున్నది—. విచారించెదను. ఎవరక్కడ? సేవకా ! మన సేనాధిపతి సూర్యాజిని నా యాజ్ఞగా వచించి యిటకు దోడ్కొని రమ్ము. పొమ్ము.

సేవకుడు

దేవా! చిత్తము.

శివాజి

లేదు—రఘునాథుడు రాజద్రోహము గావింప నే లేదు. అత డట్లు చేయడు. ఇందుల కెవరి యాలోచ నమును అవసరము లేదు. రఘునాథుడు లేక నా రాజ్య ము శోభింపదు. నా ప్రయత్నము ఫలింపదు— నేను మానవధర్మము నెంతవర కనుసరించితిని? తనకు సహా యమొనర్చిన వానిని, తన సర్వదిగ్విజయ కారణుని, తన్ను దైవమువలె భావించువానిని, తనకై సర్వస్వ మర్పింపగలవానిని, దేశాంతరుని గావించి, కడలేని యిడుమలపాలొనర్చిన కఠోరహృదయునకును, మానవ ధర్మమునకును ఏటి సంబంధము. రఘునాథుడు ద్రోహ మొనర్చినను నాకు సమ్మతమె. నే నాతనిని రావించె దను. (ఆలోచించి) పొరపడుచున్నాను. అట్లైనచో నేను ధర్మధ్వంసకుడ నయ్యెదను, ధర్మహాని యగున ప్పుడు నా సహచరులను, నా రాజ్యమును, వేయేల, నా సర్వస్వమును పరిత్యజింపగలను. అతనిపై మోప

బడిన అభియోగ మెంతవఱకు విమలము కాదో అంత వఱకును నా యీభావమునకు స్థాన మొసంగ జనదు.

సూర్యాజి (ప్రవేశించును.)

ప్రభూ ! అనుజ్ఞయేమి ?

శివాజి

రఘునాథాభియోగ పరిశోధన మెట్లుమారుచున్నది? మీ కెవ్వరిపై ననుమాన మున్నది?

సూర్యాజి

బీజాపురసుల్తానుని సేనాని అబ్దుల్ రజాక్‌ను క్షమించి నాటిదర్బారుసమయమున వదలివేసితిరి. అప్పటినుండియు చందర్ రావునకును ఆతనికిని రహస్యాలోచనము జరుగు చున్నది.

శివాజి

వీరే కారకులనియా మీయూహ?

సూర్యాజి

వీరే కారకులు. వీరే కొన్ని తంత్రములనుగూడ పన్ను చున్నారు. చందర్ రావు సహజముగ లోభి. శత్రువు లతో స్నేహము. అప్పుడప్పు డేదో సంకేతస్థలమున వా రిరువురును సమావేశమగుచుందురు. ఇదిచాల గోప్యము. నేటిరాత్రి అబ్దుల్ రజాక్, చందర్ రావు భవనమునకు రాగలడు.

శివాజి

ఎట్లు తెలియును?

రఘునాథ్

సూర్యాజి

ఆవిషయమొకరహస్యవార్తావహునివలన కనిపెట్టితిమి.

శివాజి

సరి. నీవుపొమ్ము. నేను సత్యమును తెల్తును. ఇది యనుమానమో సత్యమో నిరూపింపబడునుగాక.

సూర్యాజి

శలవు.

శివాజి

మంచిది. (సూర్యాజి నిష్క్రమించును).

—o—

## చతుర్థాంకము—ద్వితీయరంగము.

(చందర్ రావు భవనము ప్రక్క వసారా వేపు గది. దీపము కొలదిగా వెలుగుచున్నది. ఖడ్గపాణియగు సేవకుడు ద్వారముముందు నిలచియున్నాడు. రాత్రిమూడవయామము గడుచుచున్నది.)

సేవకుడు

ప్రొద్దు క్రుంకునప్పుడుపోయి సేనాని చందర్ రావుగారు ఇప్పుడెవచ్చి శయ్యపై మేనువాల్చినారు. గాఢమైన సుషుప్తి ఎంతలోకలిగినది. తొడుగుకొన్న కవచము విడుచుటయు కష్టమైనది. అలసివచ్చినవారిని నిద్రాదేవతవలె యింకొకటి ఆవరింపదు. నేడేకాదు వీరికి రెండు మూడుమాసములనుండియునిదుర లేదనియే చెప్పవచ్చును. ఆయనకులేదు. కాని నాప్రారబ్ధమేమి, నేను మేలుకొనుటతో సంవత్సరములు గడచిపోవు చున్నవి. భగవానుడాయువు దయసేయవలయునుగాని కల్పములైనను నాకీయవస్థ తప్పునట్లు లేదు. సేవకావృత్తి యెంతనీచము. ఎంతదయారహితము. ఎవరోవచ్చుచున్నట్లున్నది. [ఆలకించి] ఈ యర్ధరాత్రి అంధకారమున చోరులు కారుగదా! [లోపలినుండిదీపము వెలిగించుకొనివచ్చును]

శివాజీ మహారాజు ప్రత్యక్షమగును.

[సేవకుడు దీపమునొకవంకబెట్టి సాష్టాంగపడినిలచును]

శివాజీ

మీా యజమాని శయనాగారమున నే యున్నాడా?

సేవకుడు [శంకించుచు]

చిత్తము.

శివాజి

నీకు శంకవలదు. భయమువలదు. నేనడుగు మాటలకు క్రమముగా నీకు తెలిసిన యదార్థము చెప్పుము.

సేవకుడు [తనలో]

ఏమున్నది. చందర్ రావుగారేమి యపచారము చేసినారు? మహారాజు. తెలిసిన విషయము దాచిన ప్రాణములుండవు. [ప్రకా] కష్టపడి నడచి యీనడికేయి దేవరవారు......

శివాజి

ఆవిషయముతో నీకుపనిలేదు. చందర్ రావు వద్దకెవడైన గొప్పవాడు మహమ్మదీయుడు రహస్యముగ నిచ్చటకు వచ్చుటగాని లేక యీతడు పోవుటగాని జరుగుచున్నదా?

సేవకుడు

ఎవరు వచ్చుట లేదు. కాని.........

శివాజి

భయమువలదు. నిజము చెప్పుము నీకు గొప్పపదవి దొరకును.

సేవకుడు

వీరే అప్పుడప్పు డెక్కడికో ఒంటరిగాపోవుచుందురు.

శివాజి

తిరిగి యెంతకాలములో చేరును?

సేవకుడు

తిరిగి వచ్చువఱకు మూడుజాముల కాలముపట్టును.

శివాజి (యోచించి)

ఆతడెచ్చటికి పోవునో నీకు తెలియదా?

సేవకుడు

ఎవ్వరికిని తెలియదు. ఇతరులకు తెలియరాని ఏదో రహస్య వ్యవహార పరిష్కారమున తిరుగుచున్నారేమో నని నేనూహించుచున్నాను. ప్రభూ! ఈమాత్రమేని నాకుతప్ప అన్యులకు తెలియదు.

శివాజి

రహస్యముగ జాబులేమైన వచ్చుచున్నట్టు?

సేవకుడు

ఆసంగతి తెలియదు ప్రభూ! కానియేవో కాగితముల ముందిడుకొని ఒకటే యాలోచనతో ఒక్కొక్కనాడు భోజనముకూడ చేయరు.

శివాజి

ఈరాత్రి......(సేవకుడు)

ఈరాత్రి ఇప్పుడేవచ్చి నిద్రించినారు. (శివాజి శయ్యాగారమును ప్రవేశించి అటునిటు పరీక్షించుచుండును)

సేవకుడు—(తనలో)

ఎవరినైనను నేను నిద్రించుచుండగా లోనికి రానీయ

వలదని యజమానుని యాజ్ఞ. వారు తనకును నాకును ప్రభువులు. ధర్మ స్వరూపులు. ఎట్లు వారించగలను— లేచిన ముప్పు వాటిల్లునేమో—

శివాజీ—(సేవకునితో)

నీవిచ్చటినే యుండుము. (శివాజి చందర్ రావు కవచములోనుండి ఒక యుత్తరమును పైకి తీయును.)

"రఘునాథుని దేశభ్రష్టుని జేసినాము. నీవాగ్దానము ననుసరించి రాజును పదచ్యుతుని చేయ గలిగితిమేని, సుల్తాను వారివిశాలరాజ్యమునకు నీవుమంత్రివి కాగలవు"

ఆ. ఇది ఘోరము. మహాపాతకము. నేనెవరు? ఇది యమలోకము కాదుగదా? ఎచ్చటివీ భూతములు... నాతల తిరిగిపోవుచున్నది. మహారాష్ట్రమును అగ్ని పర్వతములు పగిలి వ్రేల్చి భూగర్భములో కలుపుకొనుచున్నవి. ఇంకెక్కడి శివాజి—

ఔను నేను శివాజీని, మతరాజ్యముల యున్నతిక సేవకుడనగు శివాజీని—నాకర్తవ్యమేమి? ఇది చందర్ రావు శయనాగారము... ఈయుత్తరము. నాయొడలు మండి పోవుచున్నది. (మరల యుత్తరమును చూచును) "నాపంపిన బహుమానపు ఖడ్గమును జయము కలుగు వరకు గుప్తముగనే యుంచుకొనుము" ఓహో! ఈ యుత్తరము నాపైకి త్రాచుపామువలె పడగవిచ్చుకొని వచ్చుచున్నది. (ఉత్తరము క్రింద జార్చును.)

ఖడ్గము......గుప్తము, (తడబడుచు గదియందంతట ను, నెమ్మదిగా శయ్యక్రిందను వెతకును. చందర్ రావు పరున్న వైపున దొరకును (ఖడ్గముతీసి) ఓ ఖడ్గమా! నన్ను హత మార్చుటకు, దేశాభిమానమున పొంగులెత్తు నా వేడి రక్తమును చవి చూచుటకు వచ్చితివా? నా రాజ్యమును, నా మతమును, తురక బానిసీడుల కప్పగింప దలచితివా? అట్లుకాదు. అది వ్యత్యస్తమైనది. ఇప్పుడు నీ యజమానుని గుండెలలో స్థిరావాసము గల్పించుకొననున్నావు. వీడు కర్తవ్యపరాయణుడు. దేశభక్తుడగు శివాజియని యెఱుంగుము. (చందర్ రావు వైపుతిరిగి) నీవు దేశద్రోహుల, విశ్వాసఘాతకుల స్నేహముచే పవిత్రమైన హి...హిందూ......మహారాష్ట్రము నంతయు నొక్క-సారిగా......చందర్ రావు! (ఆతడు కదలును) చందర్ రావు! చచ్చుచున్నావు. (లేవకుండగనే ఖడ్గముతో పొడువగమకించును) దీర్ఘనిద్రనీకు చందర్ రావు! (చందర్ రా వులికిపడి లేచును. ఎదుట శివాజి—తన రాజద్రోహము తెలియవచ్చెనేమోయని భయావేశముతో)

చందర్ రావు

ప్రభూ! తామీరాత్రివేళ—దయచేసితిరి.

శివాజి

రాత్రి, కాళరాత్రి. భయద మేఘాచ్ఛన్నమైన యంధకారమున మృత్యుపాశ భయంకరుడైన యమునివలె

రఘునాథ్

......యమునివలె......నీపాపములు పండిపోయినవి. పాపీ! హరహరమహాదేవ్! భవానీ!!

(నులిమి లేవకుండగ తన భవానీఖడ్గముతో పొడిచివేయును)

---

## చతుర్థాంకము—తృతీయరంగము.

(యమునానదియొడ్డున అరణ్యము. అందు మహారాష్ట్రసన్యాసుల ఆశ్రమములు గలవు. ప్రభాతసమయపు మసకవెలుతురులో చెట్లు, పటీరములు స్పష్టముగా కనుపించుట లేదు. అది వర్షకాలము. యమునఒడ్డుల నొరసి పారుచున్నది. ఆ తరంగములు రేవుతూ వచ్చే చల్లటిగాలి అప్పుడే ఆశ్రమవాసుల మేల్కొలుపుచున్నది. రఘునాథుడు ఆసమయంలో యమునఒడ్డున నిర్వేదంతో కూర్చొని యున్నాడు)

నాటి యా మధురమోహనములగు వీక్షణమాలికలు, వచోమాధుర్యము నన్ను పరవశుని జేసినవి.

తళుకుంజెక్కిళులందు స్వేదము, నితాంతస్వచ్ఛమందానిల
మ్ములచే లాలితమై పరాగపటలంబుల్ సోక పైపైన, స
ల్లలితప్రాంచదపాంగమాలికలజాలన్ జుట్టి కంఠమ్మునన్
పలికెన్ ప్రేమదొలంకకోకిలకలస్వానమ్ముతో నింగన్.

ఆరమణీయదృశ్యము నా హృదయఫలకమున బింబితమై అనన్య వైభవోపేతమగు ప్రకృతి సౌందర్యమును మరపించుచున్నది. పొరపడుచున్నాను. ఓహో! అదియును ప్రకృతి మయరూపమేగదా. ఈ ధరాతలమున నాశ్చర్యమందదగు ప్రకృతి భిన్నపదార్థమేది—

సర్వలోకైకరక్షణుండగు భగవానుడు ప్రకృత్యాత్మకుడు. అట్టి ప్రకృతి రహస్యమంతయు నా ప్రియు

రాలియందు కేంద్రీకరింపబడినది. ఆ మహాభాగ్యము నాదిగా జేసికొని యనుభవింపరాదుగదా.

చిగురాకు తెగమేసి • పొగరొందుకోయిల
  అమలస్వరమ్ము కం • ఠమునగూర్చి
అరవిచ్చునెత్తా దా • మర పూలరేకుల
  రాగసంపద నంగ్రహు • లకుఘటించి
ప్రావృట్పయోదశో • భారమ్యనీలిమ
  కాంతి కురులకునూడ్చి • గమునకుంచి
కమనీయమగు దేహ • కాంతికి మెఱుపు దీ
  వియలమిసిమిని గ • ల్పించిమలచి
నిభృతదరహాసమందు చం • ద్రకలిమిడ్చి
ఫుల్లసరోజగంధ సం • యుతము జేసి
ప్రకృతి లీలాకలాప సం • పదలవెల్ల
ఏకముగ జేసి బ్రహ్మ సృ • జించినాడు.

ఏమి ప్రయోజనము. నా నిరపరాధిత్వము నిరూపించుకొనలేకున్న, దేశద్రోహాపవాదకర జీవితమునకు నిజ ఖడ్గమే శరణ్యమగుగాక యని సందేశమా ఆమె యొసగినది ? ఏమి ఆ దేశాభిమాన పూరితమగు మహారాష్ట్ర తేజము ? నాకొఱకామె జీర్ణించిపోవునా ? ఎంతటి యసామాన్య ప్రేమతత్వము. వీరపత్నీ! నీ ప్రేమతత్వము సర్వ ప్రపంచమున కాదర్శమగునుగాక. హృదయమా! శాంతింపుము. అవిగో మహారాష్ట్ర సన్యాసుల

ఆశ్రమములు. అచ్చటనే తొల్లి మహానుభావుడును, గీతాధర్మకర్తయు నగు శ్రీకృష్ణ భగవానుని లీలా విహారమున ధన్యమైయె నేడు శీత లోదకకూలంకషయగు యమునాతరంగిణి తనసహజనైర్మల్యముతో ప్రవహించుచున్నది. బాలసూర్యుని వజ్రప్రకాశకిరణములు చిరుగాలి తాకున మిలమిల యని సంచలించుచు యమునా మధుర తోయముల దళ్కొత్తుచున్నవి. విచారము దక్కి యాదృశ్యము నవలోకించెద. (పోయి యమునయొడ్డున కూర్చొనును.)

ఆహా! ఆకురంగమెంత యాహ్లాదకరముగ నీదృశ్యము నవలోకించుచున్నది. ఓ మృగశాబకమా!

ఏల దిసలంట చూచెద • వీవుసాము
ననులుచున్నట్టి దర్భాంకు • రములజార?
ఈ నదీమనోహరగాన • మేమొనీకు
తెలియదిది యోగవిద్యాసు • ధీవతంస
కృత తపోజాల విమల సం • కీర్తనమ్ము.

పచ్చని గడ్డిపరకలనుమేసి, ఏదియో తెలుపరాని అవ్యయానందమున పరువులెత్తుటదప్ప మీకేమి తెలియును.

(తెరలో)

అయ్యో! స్వామీ! ఘోరము, ఎట్టి దారుణవార్త తెలుపవలసి వచ్చినది. సర్వనాశనము—సర్వనాశనము.

(గోస్వామివిభ్రాంతుడై) ఎవరువారు శివానందా! ఏమి మూడినది. మనప్రభువు కుశలమేగదా; మన రాజ్యమున కే భంగము వాటిల్లదుగదా? [పరికించుచుండును]

శివానందుడు

స్వామీ! మోసముజరిగినది.

గోస్వామి

అయ్యో యేమి? చెప్పవేమి?

శివానందుడు

మన శివాజీ రాజేశ్వరుని మోసముగా ఢిల్లీలో చెరసాల ... ...

గోస్వామి (ఆతురతతో)

చరసాలయందు బంధించిరా? హా! హతోస్మి. హతోస్మి. [మూర్ఛితుడగును]

శివానందుడు [స్వగ]

ఈ పరమ వీర శిఖామణియగు దేశభక్తున కెంతటి భావావేశమున్నది. [ప్రకా] స్వామీ! స్వామీ!!

గోస్వామి [ఉలికిపడి లేచి]

ఔరంగజేబ్! ఎంతపనిచేసితివి. ... ... ... మహా ప్రభూ! నీ ప్రతాపమంతయు నేమైనది?

యవనదళంబులక్షలుపరి॥యాసమునందిమరాఠదుర్గముల్
గవిసి యనేకరీతులను ॥ గారియవెట్ట జయమ్మొకల్గె నీ

యవిరళ రాజనీతికి ది • గంతమదేభ శిరః ప్రకంపనో
ద్భవచలితశ్రీవోనిలము • వాపగమెచ్చుచు తచ్ఛ్రీ
మద్మ్కలన్.

( నిర్ఘాంతుడై శివానందునితో ) అవక్రిమ రాజనీతి శాలియగు ప్రభువేల యాతని మాయావ్యూహమున జిక్కుకొనెను ? శత్రుకంఠ నిర్గళన లుఠ దుధిరధారా నిమజ్జనోపశాంత భీకర హృదయుడగుశివాజిరాజేశ్వరుని, మహారాష్ట్ర మహీధర గుహాంతర భయద కేసరీ కిశోరమును, ఆ? ఎంతసాహసము! ఆకుట్ర ఎట్లుజరిగినది!

శివానందుడు

శరరంగయోధుడగు బాపరభూమహావీరుడుదిలేర్ఖానునితో నెదిర్చి తన ఏడువందల సైన్యముతో హతుడై పురందరుకోట మొగలుల హస్తగతమైనది. తరువాత నిరుపక్షములవారును సంధిచేసుకొనిరి. "శివాజీ ! నీయుపకారమునకును శౌర్యమునకును మెచ్చితిమి. నిన్నొకమారు చూడదలంచితిమి ఢిల్లీకి దయసేయవలయును " అని కొన్ని బహుమానముల సైతము బంపి చక్రవర్తి రప్పించుకొనెను. తన వెంటబోవ పోరువెట్టిన శంభాజీ సమేతముగా బోయెను. వేయిమంమావళే వీరులును అయిదువందల కాల్బలమును వెన్నంటినవి. ఎంతయో గౌరవము సేయునని యూహించిన స్వాతంత్ర్య ప్రియుడగు మన ప్రభువు ఆస్థానమును ప్రవేశించినంతనే

సేనా నాయకు లుండు స్థలమున కూర్చుండ నౌరంగు డాజ్ఞాపించెను.

గోస్వామి

ఆ, ప్రభూ ! ఆ మహాపచారము నెట్లుసహింపగలిగితివి?

శివానందుడు

తరువాత రామసింగుని యింటివద్ద బస నేర్పరించి అందే చెరబట్టినారు.

గోస్వామి (దీర్ఘముగ నిశ్వసించి)

మొగలు లెంతపనికి సాహసించిరి. మహాప్రభూ ! శివాజీరాజచంద్రమా ! శత్రుకాంతామణిని, చేజిక్కినప్పుడు సౌందర్యవతియనియు తలంపక తోడి రాజలోకమునకు సిగ్గగునట్లు జితేంద్రియుడవై "నాతల్లికింత సౌందర్యమున్న నేనెంత యదృష్టవంతుడ నగుదు"నని సగౌరవముగ బంధుశ్రేణి కప్పగించితివే !

సైన్యములులేక, కోటలులేక, అనుగు తండ్రియగు శహాజీరాజు చేయూతయైనలేక, సహజమగు నాత్మశక్తి ధైర్యాభిమానములే యూతగాగొని కేవల శూన్యమునుండి యొక గొప్ప రాజ్యమును స్థాపించితివి. కొలది కాలమైన కాకమున్నె, రామదాసస్వామిపై గలుగు భక్తిపారవశ్యమున ఒక్కసారిగ సర్వస్వమును ధారవోసిన త్యాగమూర్తివే! హిందూమత రక్షణార్థము యుద్ధరంగముల, ప్రాణపరిత్యాగమునకైన వెనుకంజ

వేయని దేశభక్తాగ్రేసరుడవే! అట్టివాని కన్నిటికి ఫలితముగ చెరసాల నాభవాని ప్రసాదించెనా?

ఏమహాధీరుని స్నేహమునకు బీజపూర్, గోలుకొండ నవాబులు సుంకములిచ్చి యర్థించిరో, ఏగంభీరహృదయుని మైత్రికై మోఅజీం అంతటివాడు అహర్నిశలు యత్నించెనో, ఏ దేశభక్తుని, ఏస్వాతంత్ర్యప్రియుని, వీర విహారమునకు మయూరసింహాసనాసీనుడవును, రాజాధి రాజువునైన నీవే వెరగత్తి విభీతనయనములతో దెసల పరికించుచుంటివో; అట్టి తేజోరాశిని, అట్టి దేశహితైక నిష్కామ త్యాగ దీక్షా బద్ధకంకణుని, ఔరంగజేబ్! ఏ ధైర్యమిప్పుడు కలిగినదో చెఱబట్టుటకు తెలియదు. ధర్మస్వరూపున కపచారమొనర్చి సర్వనాశనము దెచ్చి పెట్టుకొనుచుంటివే. నాప్రభువునకుగాను నేను నీగీటడగింప సంసిద్ధుడనై యున్నాను. ఓ మొగల్ సేనానులారా! మీనిరంకుశ యుద్ధ కార్యారంభములకు స్వస్తిచెప్పుడు. మీమితిలేని దౌష్ట్యములకు నేడు మీరు ఫలితము ననుభవింప గలరు. ప్రభు సేవోన్మాదియై రఘునాధుడు నేటినుండియు మీగుండెలలో నిదప్రోవ గలడు. జాగ్రత్త.

(నిష్క్రమించును.)

---

# ర ఘు నా ధ్



## ప ం చ మాం క ము

### ప్రథమరంగము.

(కారాగృహముగ సేయబడిన ఢిల్లీలోని రామసింగుని గృహము. రాత్రి రెండవయామము గడచుచుండెను. వెన్నెల బాగుగా కాయుచున్నది. శివాజికి నిదురపట్టక అటునిటు తిరుగుచుండును. కృశించిపోయి మలిన వస్త్రధారియై కన్నులలోని తేజమొక్కటిమాత్రమే మిగిలియున్న ఆదేశభక్తుని వైఖరి అత్యంత! జాలికరముగనున్నది. చల్లనిగా లిమాత్రము వీచుచుఆమహా భక్తునకుపరి చర్యసేయుచున్నది)

శివాజి

ఆ! ఔరంగుడు నన్ను నిర్బంధించెనా! ఔరంగజేబ్! ఎంతటి నీచమునకు బాల్పడితివి......? పరమాప్తుని వలె కబురంపి, నన్ను నీకడకు రప్పించుకొని తుదకిదియా చేసిన గౌరవము. నీకు వివేకములేదా? నిన్ను నీవు ప్రశ్నించుకొనుము. స్వధర్మ రక్షకుని......స్వాతంత్ర్య ప్రియుని...—పరమ దేశభక్తుని-యోధుని అతిథిగా నాహ్వానించి చెరబట్టుటకన్న నైచ్యమున్నదా? ఇది బుద్ధిహీనత కాదా? యోధుని రణరంగమున పోరివిజయ

సాధనము సేయవలయును. స్వార్థరహితముగ, స్వధర్మ రక్షణార్థము యత్నించుచు, అస్మన్మాతృదేశ బాధాకర ఘోర నికృష్ట దాస్యశృంఖలముల పటాపంచలుగ త్రెంచి వైచి దిగ్విజయమును ప్రతిష్ఠించుటజూచి నీకన్ను గుట్టి నదా? లేక, విశాలమగు మొగల్ రాజ్యమహామహీరుహము ను కూకటి వ్రేళ్ళతో భూవలయమెల్ల కంపింపనూపి పెక లించుచున్న ఈమహారాష్ట్రభయదమత్తగజేంద్రవిజృంభ ణమును జూచి వెఱగంది, ఆకంపితాంగముతో మతి లేక తుచ్ఛప్రాణసంరక్షణార్థము యోధుని......యో ధుని నన్ను మోసముచే బంధించితివా? ఏమి నీసాహ సము! ఎంతటిస్థూలదృష్టి ఔరంగజేబ్! నిజముగా నన్ను బంధించితిననియే మురియుచున్నావా? అదిపిచ్చితలంపు.

నీవు నిమిత్తమాత్రమునకున్న ఈ భౌతికశరీరమును మాత్రమే బంధింపగలిగితివి. ఉగ్రపాలతో నుదయించి దుర్ఘట విషమపరిస్థితులచే నింకను దృఢతరమై, మీజాతి కంతకును ఉరిత్రాడుగానున్న అస్మత్స్వాతంత్ర్యదీక్షా రజ్జువు ఏమహాయోధునకేని అభేద్యము, అసాధ్యము.

మాత్రము దాస్యమును మీదుండగములును నాకు సాక్షాత్కరించు చున్నవి. విజృంభించి ధీరత్వముతో నేత్రగోళములనుండి రక్తధారలుగురియ ఒక్క ముష్టి ఘాతముతో నీయినుప కవాటమును భేదింపలేనా—?

[కవాట భేదనమున కుద్యమించి ఆగిపోవును. నిశ్వాస ము విడుచి]

ఓ మాతృదేశమా! నీ వధోగతి పాలైతివి. నీ వెంత కాలమిట్లు దాస్య మనుభవింపగలవు. నాతో నీకు ఋణ ముతీరినది. నన్ను మరచిపొమ్ము. నేను నీపుత్రుడను గాను. నీకు జన్మించనేలేదు. బ్రతికియు చచ్చితిని. భగ్నా శయుడై సర్వబంధనము గావింపబడిన వీడెందులకు పనికి వచ్చును. [మతి తిరిగిపోయి] ఓ రఘునాధా! నీవెప్పుడు వచ్చితివి? నన్ను చూడకుము. నీవపవిత్రుడవు కాగలవు. నీ వొక పవిత్రమూర్తివి. నీవు మహావీరుడవు. నీ ప్రభు దేశభక్తులద్వితీయములు. న్యాయదూరుడనై అట్టినిన్ను దేశాంతరవాస శిక్షకు పాల్పరచిన కఠోరహృదయుని, కృతఘ్నుని, పరామర్శింప వచ్చితివా? నేను బందీనైతి నని విన్నబాటుగల హృదయముతో, బాష్పాంబుపూర్ణ నయనములతో చూచు చుంటివా? నీవెంత ప్రభుభక్తి పరాయణుడవోయి నాయనా! నీసహచరుడగు ప్రభు భక్తియుతుడగు బాజీపరభూ నాకొరకు రణక్షేత్రమున ప్రాణములర్పించినాడు. అట్టి మిమ్మందరను గోల్పోయి నేనొక బందీనైతిని—నేడు నేనొక బందీనైతిని. బందీ నైతినా నేను? చూడు భవానీ! నేను బందీని కాదగిన యపచారము నీకేమి గావించితిని? నా చిత్తవృత్తి నీకు తెలియదా? నాకీ రాజ్యము కావలెనంటినా? మహానంద దాయకములయిన ఆ మహారాజభోగములు నేననుభ వించు చుంటినా? నీవే చెప్పుము—?

ఆహా! రాజ్యధౌర్యంధర్య్య మెంతకష్టప్రదము. నరక

పతన హేతువుగదా? ఈ రాజ్య భారము వహించుటకు నేనంతజ్ఞానహీనుడనా? నా దేశముకొఱకు, నామతముకొఱకు, గోమాతకొఱకిట్లునిష్కామముగ జన్మసాఫల్యమపేక్షించి స్వధర్మము నిర్వహించుచుంటిని. తన్మూలమున వచ్చుసర్వఫలితములకును సంతోషపూర్వకముగ నాహ్వానమొసంగితిని. అందొక ఫలితముగ నీరాజ్యముగూడ నగునేమో. కాని నాకాగర్వములేదు. నాకాసౌఖ్యములేదు.—ఈకారాగృహావాసముగూడ నాస్వధర్మసారాంశమేనా? స్వధర్మ సారాంశమేనా?? అట్లగుచో నేనిందే యుండెద. ఎచ్చటికినిబోను. తల్లీ! మహారాష్ట్రదేశమాతా! ప్రసన్నురాలవుగమ్ము. ఈపిచ్చివాడు...ఈబిచ్చగాడు ..... (కనులు తేలవైచుచు నీరునించుకొనుచు) నీకొఱ కొకమాట...బాట......పాట......గీట.

ఓమాతృదేశమా! నాప్రాణాలలో ప్రాణములు, నాకమితవిశ్వాపాత్రులునై, ప్రతాపవంతులై, దేశమాతకొఱకు సమరక్షోణిని ఒక్కపెట్టుగా బ్రహ్మరుద్రాదులు తలపడినను లెక్కింపక నిజహస్తకీలితశాతశాత్రవ హేతిపాత భల్లాణ భయంకరాహతి చెల్లాచెదరుగ చించిచెండాడగల రఘునాథ మాలసురేలుగలరు. అవిరళరాజతంత్రజ్ఞుడగు సూర్యాజిగలడు. నీకేమియు భయములేదు. సరె, కాని, శివాజీలేడా—?

రఘునాథ్

(ఈ ప్రలాపములకు నిద్రాభంగముచే మసలుచున్న మహమ్మదీయ సేవకుడు) హద్దం రేత్రియేమి వుకార్వుకా రెకొగోల శేపి స్తవు. చుప్ రహెూ (అనితిరిగినిదురించును)

శివాజి (రుద్ధస్వరముతో)
ఈతురుష్కుడుకూడా నన్ను శాసించుచుండెనా?
(నిశ్చేష్టితుడై యుండును)
అవనికజారును.

---

## పంచమాంకము-ద్వితీయరంగము

(మధురారణ్యములోని కాలిత్రోవ, కంటకలతాకీర్ణమైన అడవి. అచ్చటచ్చట కొండలు, అదిమధ్యాహ్నమగుటచే మంచుకరిగి కొండ ప్రక్కలనుంచి ప్రవహించుచున్నది. ప్రచండమగుసూర్యుని వేమిడికి పొదలలోని క్రూరజంతువులు మూలుగుచున్నవి. దూరముగా నేవో కొన్ని పర్ణశాలలు కనుపించుచుండును. దూరమునుండి సితార్ ధ్వనితో గలసిదీనముగా కొన్ని గేయముల ఆలాపన వినవచ్చుచున్నది. ప్రియాన్వేషణము సేయుచు సరళ ఈ కాలిత్రోవగుండ నొంటరిగా ప్రయాణించుచున్నది.)

సరళ (దీనముగా)

చేరల గొల్వగాదగిన • చెల్వగుకన్నుల ధీరదృష్టి,దో
స్సార పరాక్రమస్ఫురిత • శాతమహోజ్జ్వల భల్లహస్తుఁ,
వీరవరేణ్యు డోయనగ • బేర్కొనుతామె; త్వదీయమూర్తి క
న్నారగ జూచుభాగ్యమది • యబ్బెనె? ఓసఖులార! చెప్పరే!!

మద్వినిర్మల ప్రణయరాజ్యాధి నాథా! నాథా!!

తడబడుచుండె నీయడవి • దారులనేగుటచేత పాదముల్
ఒడలువడంకు భీతిమెయి•నూర్పులు హెచ్చె, కనుఁ
భ్రమించుటఁ
సుడివడిపోతి కన్పడవు, • చూడడుతండ్రి వివేకమింత న
న్నడుగకె పెండ్లియత్నముల • నన్నియుసేయు ననుగ్ర
హింపవే॥

ఓవన దేవతలారా ! భూరుహాలత్రేష్ఠములారా! ఓగిరిగహ్వార నిర్ఝరములారా! పరమవీర శిఖామణియగు నాధుడు, అనన్యసామాన్య దేశారాధన దీక్షాపరుండ గునాథుడు, మోహనవిసిల కుటిలాలక పరిశోభిత దరహాసాంకు రచ్ఛన్న సుందరవద నారవిందుండగు నాథుడు, సాధుసేవాధర్మనిరతుఁడగునాధుడు, అట్టినాధుడు లోకోపకారి మీకంట బడలేదా? ఆనవసరా రోపిత దుర్యోగ శిక్షావమాన సంతప్తహృదయుడు మీ యండ జేగియుండడా?ఓహో! మీరుగాక ఈతరుణమున నాప్రియున కెవ్వరుశరణ్యము సత్స్వభావలగు మీరా తనిశ్రమాపహారార్థము మధుర సుఫురస ఫలాహారము లొసగిగౌరవించుచున్నారా! తదే కాంతవిశ్రమా వాస భంగకారకురాలనగునాకు మీమౌన మంగీకారసూచక మైనది.

ఓప్రణయమూర్తీ!నీశౌర్యమును, దేశభక్తిపరాయణ తను, నేను మోహించితిని. ఇట్టి నిన్ను భర్తగాగైకొని దేశసేవ గావింపవలెననియే నాయాశయము. కేవలము నీసౌందర్యమునకు వివశతజెందిన స్వార్ధపరురాలనుకాను. నాప్రేమ నిష్కల్మషము నిరతిశయము. ఒకసన్యాసి జోస్యముచెప్పుచు నీవు నాపై వలపుతో కుమిలిపోవుచున్నావనెను. గాఢమగుదేశాభిమానముతో గర్భితమైన నీహృదయమునుగూడా నాప్రేమమూసిపోయి నదా. ధన్యురాలను. నాఆశయము నెరిగియు ఎచ

టనోపోయిన దేశభ్రష్టుడవని మజ్జనకుడు బలాత్కృతి నెవనికో ఈయ సంకల్పించుకొనియున్నాడు. నేడేసుము హూర్తము. ఈయరణ్యమునసుండుమని సన్యాసి మాటల విశ్వసించి దుర్గమములగునీమార్గములబడివచ్చుచుంటిని. చచ్చునంత వరకు సుఖాసుఖము లనుభవించి మోక్షసామ్రాజ్యమును చూరగొనుటకు మార్గదర్శకుడగు ప్రాణ భర్తను వరించుటకేని ఈ కాంతాలోకమునకు స్వాతంత్ర్యములేదా? ఓ భరతఖండమా! నీకు మోక్షమేలేదా? ఇట్టి యనాగరికమూర్ఖ సంతానమునెట్లుకంటి టివి. జననీజనకుల కీస్వాతంత్ర్య మెవరిచ్చిరి. నిజము మాట్లాడెదను. ఓ భరత దేశీయ జననీజనకులారా! మమ్ము జ్ఞానవంతుల సేయువరకే మీబాధ్యత. తరువాత మాజీవిత సంస్కారమునకు మేమే బాధ్యులము. మీ మూర్ఖమగు స్వార్థపర దురాచారములకు ఎందరెందరు సోదరీమణులు విగతప్రాణులై, విగతభర్తృకలై నశించి పోయిరో! సాహసురాండ్రును, పవిత్ర హృదయలును నగు వనితలతోడ్పాటులేక దేశమున కెప్పుడును విముక్తి కలుగదు.

జన సామాన్యమగు నాచారమున కిన్ని యమూ యికజీవితములు బలికావలసిన దేనా? ప్రాణప్రియా! నేనెప్పుడును కోరుకొను న దేదియనగా.

అమలభవదీయపాద దే • శాంగణమున
భవ్యపూజా ప్రసూనమై • వరలుగాక

తత వియోగదారుణ శుష్క • తప్తమైన
అస్మదీయ సుహృదయ ల • తాంతమెపుడు.
[ పోవుచుండును]

[అదే యరణ్యములోనింకొకభాగము. ముగ్గురు మొగల్ సైనికుల వెంటాడుచు శివాజి ప్రవేశము.]

అనుమానింపగ జంకువాడనో? మీ•ఆయుష్య మీ దేశభక్తుని, ఈదివ్యమరాఠశూరవరుబా•కుఁ మీరియెందేగు,మీకును మీజాతికి,మీ ప్రభుత్వమునకుఁ•కొంకేలచాటింతునింకను తావుండగబోదుభూమిపయినా• కస్వామితోడైనను.

అన్యాయముగ, మోసముగ, అధర్మముగ పట్టుబడిన శూరకులమృగేంద్రము ఉచ్చుత్రాళ్ళు విదల్చుకొని ఒక్కపెట్టునసిచమ్లేచ్ఛకురంగలోకముపై విజృంభించినది. ఇక తప్పుకొన మీతరముగాదు. [అని వెంటాడుచుపోవును.] [తిరిగిప్రవేశము.]

1వ తురుష్కుడు

జైల్ ఖానానుంచి తప్కవస్తున్నావు నీకి? [పారిపోవును]

2వ తురుష్కుడు

అరే ప్యాణంపోతే పాయ్. ఈణ్ణిపట్కపోవాలి [పట్టుకొన పెనగులాడును. నిగ్రహించి తిరిగి ప్రవేశము.]

3వ తురుష్కుడు

హామారేఖూమ్కూ సబ్ నోఖ్నాఁ కర్నేఆతేహో.

తుమ్హ్ జార్ సేథోడ్ నే వాలా నైహుం. [ఎదురొక్కని నిలచును]

శివాజి [ఎదురొక్కని]

అరే! పవిత్రమగు మహమ్మదీయ వంశమునకును కళంక ప్రాయులగుచున్నారు. ఒక జాతిని విద్వేషించు టకుముందు మీజాతి నియమములు మీకు తెలియునా?

(అదే యరణ్యమునుండి ఈసంరంభ మునంతయు విని గోస్వామి ఖడ్గహస్తుడై ప్రవేశము)

ఓరోరి!జగదేక మహోజ్వలాగ్ని కీలా ప్రతిరోధక శల భములారా!

కనలేరే? మదగర్వ నిర్దళన యోగ్య శ్రీ శివాజీ మహే శుని, మ్లేచ్ఛాంతకు,కండ కావరమునర్ శూరుండ, దేశమ్ముకై మునినైనర్ కరవాల మూనుటది సమ్మోదంబెగా,వారితో పనియేలా? అనినొంతునొక్కడ నిలింపశ్రేణి కీర్తింపగ॥

(చెల్లాచెదరు గావించును)

మహాప్రభూ! ఈనిష్కళంక దేశభక్తుడు. గాఢ ప్రభు భక్తి పరాయణు డనుగ్రహనీయుడు. (పాదములపై వ్రాలును).

శివాజి (ఆశ్చర్య భయ సంభ్రమములతో)

ఈశివాజి పాపపరిపాకమునకు మేరలేదా? స్వామీ! మీరెవరు? (లేవదీయును) స్వామి! ఈసేవకుని అపచార మేమి?

నాపురోవృద్ధికిని నన్ను నిరీక్షించు మహారాష్ట్ర దేశ మాతకును, తీవ్రనిరోధమేర్పడినది. నేనలసియున్నపుడు ప్రాణదాతలై రక్షించియు ఇటులులక వహించుట తగదే?

గోస్వామి (శివాజి చేయిపట్టుకొని)

ప్రభూ! అట్లుగాదు. మీరు సర్వదా వందనీయులు. మీజగదేక వీరత్వమును, మీయనల్పమగు మాతృ దేశారాధనమును, నన్ను పరవశుని జేసినవి. విధివశత నింతకాలము మీకుగలిగిన కారాగార దుస్థితి వినియు చేయునదిలేక సంక్షోభ హృదయముతోనున్న ఈనేవ కుని విధ్యుక్తమే ఇయ్యది. మహాప్రభూ! నిన్నెంతగ స్తుతించిన, ఎంతగ సేవించిన యీదేహధారణ భారము తీరగలదు?

శివాజి (నివ్వెరపడి చూచుచు)

"ఈసేవకుని విధ్యుక్తమే యియ్యది!" నాకేమియు తెలియుటలేదు. ఇప్పట్ల నేనొక రాతిబొమ్మను. ఈ చిత్రము నెట్లును నిర్ణయింపలేకున్నాను.

గోస్వామి

మహాప్రభూ! దేశభ్రష్ట శిక్షానంతరము నమస్కా రమునకైన నోచుకొనని యభాగ్యుడు, తిరిగి ఎన్ని దినముల కీజన్మధన్యత్వమందినది.

(శివాజి మహానందముతో కదలలేక పోవును.)

ఓహో! నీవు రఘునాధుడవా? నీవు పవిత్రమూర్తివి. నీజీవితచరిత్ర ప్రతిదేశీయునకును ఆరాధనీయము. ఎన్ని విపత్తులు చుట్టుముట్టినను, ఎన్ని ఘోరముల నెదుర్కొనుచున్నను, అవియెల్ల నిన్ను శిక్షించుటచేతనే కలిగినవి. నామనోవ్యాకులత తీరినది. ధన్యుడనైతిని. (కౌగలించుకొనును) నీసేనాధిపత్యము నీకు సగౌరవముగ నొసగబడినది. నీవు నిరపరాధివి. రఘునాధ! ఇదియంతయు నెట్లు కనుగొంటివి?

రఘునాథ్

ఒకానొక మునిబాలకుని వలన రాజ్యతంత్రమును తమ క్షేమముల నెరుగుచునే యున్నాను. ఢిల్లీలో తాము చెఱబెట్టబడితిరని తెలిసినప్పటినుండియు తురుష్కులను, తమ నవమాన పరచినవారినెల్ల కనుగొని చిత్రవధాచరణమునకై మసలుచుంటిని. ఒకనాడు ఫకీరు వేషముతో జేబున్నీసా సౌధము ముందు నేను పాడు జాతీయగీతము నాలకించి ఆమె నన్ను తన యంతఃపురమునకు రప్పించుకొని మరల వినిపించుకొనెను. దేశభక్తిగలవాడు ఏదేశభక్తుని నైన ప్రేమించునుగదా. సాహసశాలగు నామెతో గలిగిన చనువుచే మిమ్ముల తప్పింప నుపాయము బన్నించితిని. ఊరి వెలుపలికి యుద్ధాశ్వమునుదెచ్చి మీ కిచ్చిన మహమ్మదీయ ఫకీరు ఈసేవకుడే. ఆహా! ఆయమ వచోరచన ఎంత మాధుర్యమో, హృదయమంత దయార్ద్రి కోమలము.

శివాజి

రఘునాథ్ ! నన్ను మన్నింపుము. మహారాష్ట్రు లందరిలోను నీవే దేశభక్తుడవు. నీవిశాలహృదయముముందు నేనొక రేణువును. ఆ పాదుషా కూతురు నాయీ విముక్తికి సహాయురాలా ? ఎవరో పురుషవ్యక్తిమాత్ర మప్పుడప్పుడు నాకు కారాగృహమునందే దర్శన మొసగుచు పరామర్శించి పోవుచుండెను. ప్రచ్ఛన్నవేషధారియగు నాతడే యీ సాధ్వి కాదుగదా ! ఔను. ఏజాతియందైన నేమి మహాత్ము లుండకపోరు. ఈయమవలన మహామ్మదీయ జాతియంతయు పునీతమైనది. తల్లీ ! ఈభక్తుని కృతజ్ఞతాసూచక నమస్కార మనుగ్రహింప దగినది. ( నిమీలితలోచనములతో నమస్కరించును. ) రఘునాథా ! నీ యీ కడలేని యిడుమలకు నేనేగదా కారణము. రాజధర్మము నన్నెంత యవివేకిని జేసినది—

న్యాయమన్యాయమును నూహ ♦ సేయుటకును
బుద్ధికలుగదు కన్నులు ♦ మొదలె లేవు
ప్రభువులకు, చెవులె యే ♦ ర్పరచు ధర్మ
మకట ! తుది, రాజునరకంబె ♦ యనుభవించు.

(విచారపడును)

రఘునాథ్

దేవా ! తాము విచారింపకుడు. అది నా పూర్వ పాపకర్మఫలము. తాము కారణకర్తలు. భగవానుడు

ర ఘు నా ధ్

సూత్రధారి. దేవా ! ఎవరీ అభియోగము గల్పించిరి?

శివాజి.

మరచితిని. సూర్యాజి చెప్పినటుల చందర్ రావే ఈ పన్నాగము పన్నెను. ఈమహాద్రోహమున కాతనిని వధియించితిని.

రఘునాధ్

వధియించితిరా ? । నా మూలమున............ పాపము, (కన్నీరు నించును.)

శివాజి

నే నిచ్చట ఆలసింపగూడదు. నేను కాశీమీదుగా పూనా చేరెదను. సత్వరమ నీవును ప్రయాణమయిరమ్ము.

రఘునాధ్

చిత్తము. (నిష్క్రమింతురు.)

---

## పంచమాంకము—తృతీయరంగము

(ఇది వసంతకాలము. యమునఒడ్డున నేయున్న రఘునాథాశ్రమ ముపై అల్లుకొనిన అడవితీగలు పుష్పించినవి. నేడు పూర్ణిమయగు టచే ప్రొద్దుప్రొంకకమునుపే చంద్రుడు తన సుధామయ కిరణము లను అయాశ్రమముపైనను, యమునాసైకతములపైనను ప్రసరించుచుం డెను. అక్కడక్కడ నున్న నీటిలోని చల్లదనమును మోసికొని వచ్చి వాయువు పూవులను మేపి యాడించుచుండెను. గాలికి ఒడ్డుననున్న రెల్లుపొద లూగి రఘునాథునికి ప్రణమిల్లి శెలవు దీసు కొనుచున్నవి. చెప్పలేక కోవలయు, వెదుళ్ళగుంపులోనుండి ఈతనిని వీడ్కొల్పుచు "ఒ" యను విషాదగీతిక యొకటి వినవచ్చుచున్నది. ఆ దృశ్యమును వదలలేక విచారముతో)

నేటికిగదా నాకష్టములు గట్టెక్కినవి. నా నిరపరా ధిత్వము బయల్పడినది. కాని ఒక విధముగ సుకృత ముచేతనే ఈ పవిత్రప్రదేశముల విహరించు భాగ్య మబ్బినది.

జగదేకమహామహుడగు కృష్ణస్వామి వేణువుపూరిం చుచు విహరించిన దీమధురా వనాంతరములనే గదా! ఓ యమునానదీప్రవాహమా! అజ్ఞానస్వరూపుని పవిత్ర శరీర స్పర్శామాత్రమున నీవు పునీతవైతివి. అట్టి నీతో గలిగిన నిరంతర సహచర్యమును నేటితో వదలిపోవు చున్నాను. ఇపుడే పూర్ణచంద్రుని చంద్రికలును చల్లని పిల్లవాయువులతో గలసి ఈ వనాంతరముకుండ యము

రఘునాథ్

నా మధురవాహినిపై నుండి దిగంతములవరకును వ్యా
పించుచున్నవి. ఓకృష్ణా!

చల్లగ మందమారుతము • సాగెను, ఈ యమునాతరంగముల్
జల్లుచునుండెతుంపరల • శారదచంద్రమయూఖపుంజముల్
మెల్లన జేరుచున్నవి సు • మీ! సమయమ్మిదె గోపబాల! నా
యుల్లము పల్లవింప భవ • దుజ్వల వేణురవాబ్ధి ముంపవో.

భవదధరపల్లవారుణ • ప్రభలమలసి
విశ్వసమ్మోహమోహన • విమలగీతి
కా మధురవాహినుల్ పొంగ • గలిగెకృష్ణ!
తరుణ వంశీగళస్థ రం • ధ్రములనుండి.

మురళిగాన మహార్ధంబు • విరహగీతి
కలుగదలతురు మూఢసం • ఘమ్ములెల్ల
అది నిరుపమాన మహిత గీ • తార్థబోధ
ప్రేమసందేశమాహాత్మ్య • విమలజగద
నంతప్రకృతి రహస్యగా • నమ్ము కాదె!!.

(తెరలో)

సరళ

ఇదియె ఆశ్రమప్రాంతమువలెనున్నదే!

గోస్వామి (పరికించి)

మదేకాంతనిశ్చల సమయభంగ కారకులెవరు?
(ఆమెనడువలేక నడువలేక వచ్చుచుండును)
ఇదియే ఆమునివరుని ఆశ్రమమువలెగన్పట్టుచున్నది.

## రఘునాధ్

అదిగో వారచటనే విశ్రమించి యున్నారు. వెళ్ళిదర్శింతును.

## గోస్వామి

ఆవచ్చునదెవరు? సరళాదేవివలెనున్నదే! ఇంతదూరమేకాంగియెట్లువచ్చెను? నాయాశ్రమ మార్గమెట్లుగుర్తించెను? ఆ! ప్రేమసూత్ర మెంతశక్తివంతము. సర్వసృష్టియు సరళామయముగ కన్పడుచుండ ఈమెయునట్లే యగుపడు చుండెనేమో.

## సరళ

యతివరా! ఈ దాసురాలి నమస్కారము లనుగ్రహపాత్రములు.

## గోస్వామి

నాచరిత్ర మీామె గ్రహించినదాయేమి? యతిరూపు దాల్చినయోనాధా! అని సంబోధించినట్లు స్ఫురించెడిని. ఇది నామోహావికారము. ఆమెకు నాయిప్పటిజీవితమే తెలియదు. యతిశ్రేష్ఠా! యనునర్థముతో సంబోధించెను. [ప్రకా] బాలా! అభీష్టావాప్తిరస్తు. ఏమి! ఈయాశ్రమ మార్గమెవరుచెప్పిరి?

అయ్యో! ఇంతప్రయాస పడియేలవచ్చితివి. అదృష్ట ముండిన రావలసినలాభములు తమంతనడచిరావా?

సరళ [ఆతురతతో]

స్వామీ! తిరిగి నాప్రియుడుతమకు గనుపించెనా?
నా సందేశమునాలించి విముఖుడు కాలేదుకదా?

గోస్వామి

మరల కనుపించెను, కడు పవిత్రమయిన నీధీర సందేశమునకు ప్రేమ ముగ్ధుడయ్యెను.

సరళ [కనులుమూసుకొని]

మహానందము, నాశ్రమ యెల్లను తీరిపోయినది. నేను తరింపబడితిని. ఆత డిప్పు డెచ్చటనున్నాడు?

గోస్వామి

వియోగవశమున కృశించిపోయిన ఈమె తనూలతయు, ముఖ సౌందర్యమును ఒక్కసారిగ నెట్లు వికసించినవి. ఇంతటి పరమోత్సాహమున కంతరాయము సంధింప గూడదు. [ప్రకా] ఆతడిప్పు డీప్రాంతములనె యున్నాడు.

సరళ

శెలవు. ఎక్కడ వారిని కలసు కొనగలను?

గోస్వామి

చాల నలసి వచ్చితివి, కొంచెము విశ్రమింపుము.

సరళ

పాపమాతడు నిరపరాధియనిగూడ తెలిసదె. చంద్ర్‌రావుక్రూరుడీ తంత్రమునుబన్ని దేశభ్రష్టుని జేసినాడు.

గో స్వా మి

ఔనట. ఢిల్లీనుండి శివాజిరాజు తప్పించుకొని పోవుచుండగా మొగలులు ఎదుర్కొనిరి. వారిని తరిమి రక్షించినాడు రఘునాధుడు. రఘునాధుని భక్తికి శౌర్యమునకుమెచ్చి ఆతని సేనాధిపత్యముగూడ సగౌరవముగ తిరిగి యొసగబడినది. పూనావచ్చుటకాజ్ఞ ఇచ్చినాడు రాజు.

సరళ

శౌర్యమూర్తీ! నీదేశభక్తియే నిన్నుద్ధరించినది. వారుపూనా చేరియుందురా?

గోస్వామి

లేదు. ఆతడిప్పుడు నాఆశ్రమమునందేయున్నాడు. తెల్లవారుజామున ప్రయాణము.

స ర ళ

ఇచ్చటనే.....ఇచ్చటనే.....నాభాగ్యము పండినది.

గోస్వామి

సరె. సాధ్వీ ! ఆతడిప్పుడు కనుపించుననుకొనుము. తరువాత......

సరళ

నాశరీరమంతయు కృశించిపోయినది. దార్ఢ్యము లేదు. ఆయాసముకూడ ఆరంభమైనది. కేవల ప్రేమమాహాత్మ్యబలముచే రాగలిగితిని. తరువాత ఒక్కమారుగ నా ప్రణయస్వరూపుని పల్లవకోమలములగు పాదముల నాలింగనము జేసుకొని నా నిశ్శబ్ద విమల హృదయము ప్రేమగీతముల నాలపించుచుండ ఆతనిలో నైక్యమయ్యెదను.

గోస్వామి (స్వగతము)

ఈమెయే మద్వి నిర్మలప్రేమ రాజ్యాధినేత కాగలదు. ఇంతకన్న నా కీప్రపంచమున ఆకాంక్షణీయమగు వేరు వస్తువులేదు. (ప్రకా) బాలా ! ఆత డిచ్చటనే యున్నాడు. నా సమీపమునందే యున్నాడు.

(సరళ ఆశ్చర్యముతో నివ్వెరపడి చూచుచుండును.)

అట్లననేల ఆతడే నేననిమాత్రము తలచిన యభ్యంతర మేమున్నది ?

సరళ (తీక్ష్ణదృష్టితో)

నీవు పొరపడుచున్నావు. అంతకంతకును నీమాటలు విరుద్ధభావార్థము లగుచున్నవి. ఆతడే నీవుగా నెట్లు భావింతును. నీవు కడు పవిత్రుడవని నీయండ జేరితిని. ఏకాంతమని ఒరులెవ్వరు లేరని దుర్భావములనాడ సాహసింపకుము. ఒక్క పిలుపుతో మిగిలిన యాశ్రమము లలోని వారందరు చేరగలరు. ఏకాంత ప్రదేశముననే పవిత్రజ్యోతి వెలుగగలదు. జగత్ప్రసిద్ధ పతివ్రతామతల్లు లగు సీతా, దమయంతీ, సావిత్రీ, ప్రముఖ నారీశిరోమణుల మాహాత్మ్యములు విస్మరించితివా? ఆర్యావర్తమున బుట్టినవానికి నీకిట్టి నీతిబాహ్యప్రవర్తనము చెల్లునా? ఇపుడు కలిగిన నామనస్సంక్షోభమునకు ప్రతిఫలముగా నిన్నును.........నిన్నును—

గోస్వామి (చిరునగవుతో)

ఆగు మాగుము. యదార్థము నాలింపుము.

సరళ

ఏమి?

గోస్వామి

రఘునాధుని నిప్పుడు నీవు గుర్తింపగలవా?

సరళ

అదేమిప్రశ్న? నాకన్న రఘునాథుని గుర్తించువార లెవ్వరు? ఆతడు నా మనోవాక్కాయకర్మములందును గలడు. వేయేల—సర్వబహిరంతర ప్రపంచమును నా కిప్పుడు దేశభక్తుడగు నా రఘునాథమయముగా కన్పిం చుచున్నది.

గోస్వామి

(తనలో) ఓహో! ఈమె భక్తియు, ప్రేమయు పండి పోయినవి. పాపము, దేశభక్తుడగు రఘునాథస్వరూప మీామె వలచినది.

(ప్రకా) అట్టిచో నీకు రఘునాథ దర్శనము మాత్ర మంత అవశ్యమెట్లగును?

సరళ

పరిపక్వముచెందని నాభక్తిలో నట్లే రఘునాథ దర్శ నాలాలసనై యుందును. కాని ఆతడు నాకీసర్వ సృష్టిలో కనుపించుచున్నాడు. నాలో—నాహృదయములోనే యున్నాడు. అజ్ఞానముచే వెతకుకొంటిని. ఆతడు నాలో నున్నాడు. నేనాతనిలో నున్నాను......

రఘునాథ్

(కనులు మూసికొని తన్మయానందము ననుభవించును)

గోస్వామి (తనలో)

ఇంకను పరిశీలించుట తగదు. ఇప్పటికే చాలబాధించి తిని. ఈజటావల్కలముల త్యజించి నిజరూపముతో సాక్షాత్కరించి సుఖించెద. (ఆశ్రమమున గుప్తముగ నుంచబడిన క్షత్రియయోగ్యమగు తనదుస్తులధరించి ప్రవేశించును)

రఘునాథ్

ప్రాణసతీ! ఈతడు నీపవిత్ర హృదయాంతర్వర్తియగు రఘునాధుడేమో యూహించుకొనుము.

సరళ (తేరిపారచూచి)

ప్రాణప్రియా! యతిరూపు ధరించినది నీవేనా? అట్లగుచో నేను మహాపాతకురాలను. నాయంతటి బుద్ధి హీనురాలు, కృతఘ్నురాలింకొకతె ఈప్రపంచమున నుండబోదు—నాథా! ఈదాసురాలిని మన్నించి నీలో గలిపికొనుము—చరితార్థురాలి నొనర్పుము. (పాదముల నాలింగనము జేసికొనును)

రఘునాధ్ (లేవదీయుచు)

నిన్నుమన్నించు అధికారము సైతము నాకున్నదా?

రమణి! అడవిపాలొనరించి • కుమతియగుచు
నిను పరీక్షానెపమ్మున • మనమునొవ్వ
బలికిన కఠోర హృదయుడీ • ప్రాణభర్త
నిర్మల ప్రణయమూర్తి మ • న్నింప దగడె?

(ఇరువురిచూపులొక్కచో కలసిపోవ లేవదీయు రఘునాధుని బాహువులలోని సరళ)

అవనికజారును.